


అంతర్జాతీయ కార్మిక సంస్థ
(ఐ.ఎల్.ఓ) సహకారంతో
ప్రత్యేక అనుబంధం

# కార్మికలోకం

జనవరి 2002

## బాలకార్మిక వ్యవస్థను నిర్మూలించండి

పిల్లలు బడికి - పెద్దలు పనికి

బాల కార్మిక వ్యవస్థ నిర్మూలనకు అంతర్జాతీయ కార్యక్రమం - ఆంధ్రప్రదేశ్ ప్రాజెక్టు

CI

## నూతన సంవత్సర శుభాకాంక్షలతో . . .

## కొడిగెన హళ్ళి గ్రామ పంచాయితి 2001-2002 ఆర్థిక సంవత్సరమునకు వివిధ పథకముల క్రింద సాధించిన ప్రగతి వివరములు

| పథకము | | వివరాలు |
|---|---|---|
| E.A.S. | 1. | కొడిగెనహళ్ళి గ్రామం నందు ఎస్.సి. కాలనీ నుండి కాలువపల్లి గ్రామంకు పొలం దారిపని 1500 మీ. |
| J.G.S.Y. | 1. | కొడిగెనహళ్ళి గ్రామంలో శ్రీ ఆంజనేయస్వామి గుడి ముందర ర్యాంపు నిర్మాణం |
| | 2. | ఎం.పి.పి. స్కూల్ నుండి మడకశిర మెయిన్‌రోడ్ వరకు మురుగు కాలువ నిర్మాణం |
| | 3. | సుబ్బరాయినపల్లి గ్రామంనందు ఊరిముందర ర్యాంపు నిర్మాణం |
| | 4. | కాలువపల్లి గ్రామం నందు దొడ్డయ్య ఇంటి దగ్గర ర్యాంపు నిర్మాణం. |
| పనికి ఆహార పథకము | 1. | కొడిగెనహళ్ళి ఎస్.సి. కాలనీ యందు ఇన్‌టర్నల్ రోడ్స్ నిర్మాణం |
| | 2. | కొడిగెనహళ్ళి ఎస్.సి. కాలనీ యందు గుంత పూడ్చు పని |
| | 3. | బి.సి.కాలనీ యందు ఇన్‌టర్నల్ రోడ్స్ పని |
| | 4. | సాయిబాబా గుడి ఇన్‌టర్నల్ రోడ్డుపని |
| | 5. | బాలరెడ్డి టెంపుల్ రోడ్డుపని |
| | 6. | సుబ్బరాయనపల్లి గ్రామం ఇన్‌టర్నల్ రోడ్డుపని |
| | 7. | కొడిగెనహళ్ళి గ్రామం నందు ఎం.పి.పి. స్కూలు ఆవరణంలో గుంతలు పూడ్చుపని |
| | 8. | కాలువపల్లి గ్రామంలో స్మశాన వాటిక రోడ్డుపని |
| | 9. | కాలువపల్లి గ్రామంలో వీరలక్కప్పగుడి రోడ్డు |
| | 10. | కాలువపల్లి గ్రామంలో పి.డబ్ల్యు.ఎస్. బోరు దగ్గర గుంతలు పూడ్చుట |
| | 11. | పెద్దరెడ్డిపల్లి గ్రామం మారుతినగర్‌నందు ఇన్‌టర్నల్ రోడ్స్ పని |
| | 12. | పెద్దరెడ్డిపల్లి గ్రామం ఎస్.సి.కాలనీ యందు ఇన్‌టర్నల్ రోడ్స్ పని |
| | 13. | పెద్దరెడ్డిపల్లి గ్రామం నుండి కోనాపురం దారి పని |
| | 14. | బిందూనగర్ నందు ఇన్‌టర్నల్ రోడ్లు పని |

కార్యనిర్వహణ అధికారి
గ్రామ పంచాయితి కార్యాలయం
కొడిగెన హళ్ళి, అనంతపూర్ జిల్లా

# కార్మిక లోకం

జనవరి 2002

వెలుగు చిమ్ము భానుడా
ఉద్యమాల సూర్యుడా
నీ ఉదయారుణ కిరణాలు
జగమంతా ప్రసరించును
దోపిడీని దహియించును !





# "పిల్లలు బడికి - పెద్దలు పనికి"

- శ్రీ యం.డి.జోసఫ్,
ప్రాజెక్టు మేనేజర్, ఐ.ఎల్.ఓ-ఐ.పి.ఇ.సి. - ఎ.పి.స్టేట్ బేస్డ్ ప్రాజెక్టు

(ఆంధ్రప్రదేశ్‌లో బాల కార్మిక వ్యవస్థ నిర్మూలన కోసం చేపట్టిన ప్రాజెక్టుపై **"కార్మికలోకం"** మాసపత్రికకు ప్రాజెక్టు మేనేజర్, యం.డి.జోసఫ్ గారు ఇచ్చిన సమాచారం, వివరాలు.)

"బాల కార్మిక సమస్య పరిష్కారంలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాన్ని ఒక నమూనాగా తయారు చేయాలనేది మా సంకల్పం. ఈ ప్రాజెక్టు ద్వారా బాలకార్మిక వవస్థ నిర్మూలన కోసం అవసరమయిన సామర్థ్యాన్ని, ప్రచారాన్ని కల్పిస్తాం. ట్రేడ్ యూనియన్లు యాజమాన్య సంఘాలు, రాష్ట్ర ప్రభుత్వం, ప్రభుత్వేతర సంస్థల నుండి ప్రాజెక్టుకు మంచి సహకారం లభిస్తున్నది."

### బాలకార్మికుల ప్రాజెక్టు - ఐ.ఎల్.ఓ. (అంతర్జాతీయ కార్మిక సంస్థ) :

ఐ.ఎల్.ఓ. అనేది ఐక్యరాజ్య సమితిలో ఒక అంతర్భాగం. ఇది ఒక ప్రత్యేక విభాగం. కార్మికులకు సంబంధించిన అంశాలపై ఐ.ఎల్.ఓ. పని చేస్తుంది. యునైటెడ్ నేషన్స్ పరిధిలో బాలకార్మికుల సమస్యలపై పనిచేసే అంశాన్ని ఐ.ఎల్.ఓ కు అప్పగించబడింది. గత 10 సం॥ల నుండి ఐ.ఎల్.ఓ. బాలకార్మికులపై ప్రత్యేక కార్యక్రమాలు చేపట్టి కృషి సలుపుతున్నది. వీటిని బాల కార్మిక వ్యవస్థ నిర్మూలనకై అంతర్జాతీయ కార్యక్రమం (ఐ.పి.ఇ.సి.) అని అంటారు. ఈ కార్యక్రమాన్ననుసరించి ఆంధ్రప్రదేశ్‌లో 1992లో రాష్ట్ర స్థాయిలో ప్రాజెక్టు కోసం పని ప్రారంభించింది.

### ఆంధ్రప్రదేశ్‌ను నమూనా రాష్ట్రంగా తీర్చిదిద్దాలి :

భారతదేశంలో ఈ అంశం కంకరెంట్ (ఉమ్మడి బాధ్యత) లిస్టులో వుంది. అంటే కేంద్ర ప్రభుత్వం, రాష్ట్ర ప్రభుత్వాలు కలసి, సంయుక్తంగా కృషిచేయాల్సి ఉంటుంది. 1986 లోనే బాలకార్మికులతో పనులను చేయించటాన్ని నిషేధిస్తూ కేంద్రప్రభుత్వం చట్టాన్ని తెచ్చింది. కాని దీన్ని అమలు చేసే బాధ్యత మాత్రం రాష్ట్రప్రభుత్వాలపై, రాష్ట్ర ప్రభుత్వ అధికారులపై ఆధారపడి వుంటుంది. అందువలన ఐ.ఎల్.ఓ. ప్రాజెక్టును ఆంధ్రప్రదేశ్‌లో గత సంవత్సరం నుండి ప్రారంభించాము. బాలకార్మికుల సమస్యలపై కేంద్రీకరించి ఈ రాష్ట్రాన్ని ఒక నమూనాగా తయారు చేయాలనేది మా సంకల్పం.

### ఈ ప్రాజెక్టులో బహుముఖ అంశాలు వుంటాయి:



రాష్ట్రస్థాయిలో చేపట్టిన ప్రాజెక్టు ఈ క్రింది అంశాలపై పని చేస్తుంది.

అ) బాలకార్మికులతో పనులు జరపకుండా నిరోధించటం,

ఆ) బాలకార్మికులపై సమాజానికి చైతన్యం కల్పించటం

ఇ) బాలికలపై ప్రత్యేక శ్రద్ధను వహించటం.

ఈ) బాలబాలికలతో పనులు చేయించే కుటుంబాలకు అదనపు ఆదాయ అవకాశాలు కల్పించటం.

ఉ) బాలకార్మిక వ్యవస్థ నిర్మూలన కోసం అవసరమైన సామర్థ్యాన్ని, ప్రచారాన్ని కల్పించటం.

### ఈ ప్రాజెక్టు అమలులో అందుతున్న సహకారం - మా అనుభవాలు :

అన్ని వైపులనుంచి మా కార్యకలాపాలకు మంచి ప్రోత్సాహం, తోడ్పాటు లభించనున్నది. రాష్ట్రంలోని ట్రేడ్ యూనియన్‌లు మంచి తోడ్పాటునందిస్తున్నాయి. ఎటువంటి సంకోచాలూ లేకుండా మా ప్రతిపాదనలను ట్రేడ్ యూనియన్‌లు అంగీకరించాయి.

ట్రేడ్ యూనియన్‌ల మధ్య ఫెడరేషన్‌ల మధ్య సహజంగా ఉండే విభేధాలను కూడా ప్రక్కనబెట్టి ఈ కృషిని జయప్రదం చేయటానికి ఐక్యంగా కృషి చేస్తున్నాయి. పరస్పరం చర్చించుకొని వివిధ జిల్లాలలో ప్రాజెక్టులను చేపట్టాయి. బాలకార్మిక వ్యవస్థకు వ్యతిరేకంగా పనిచేయటానికి 50వేల మంది కార్మికులను ఒక శక్తిగా సమీకరించటానికి ఇవి సంకల్పించాయి. 22 రంగాల యాజమాన్య సంఘాలు కూడా కృషి చేస్తున్నాయి. తమ కృషిని జయప్రదం చేయటానికి అవి ఒక ఐక్యవేదిక (కన్సోర్టియం)గా ఏర్పడినవి.

రాష్ట్ర ప్రభుత్వం, రాష్ట్ర ప్రభుత్వాధికారులూ కూడా బాగా సహాయపడుతున్నారు. అనేక మంది జిల్లా కలెక్టర్లు, తమ పూర్తి సహకారాన్ని అందించుతున్నారు. ప్రకాశం జిల్లాకు గతంలో కలెక్టరుగా పనిచేసిన శ్రీ సునీల్‌శర్మ, ఎడ్యుకేషనల్ సెక్రటరీ-ఐ.వి.సుబ్బారావు, చెన్నారెడ్డి హ్యూమన్ రిసోర్సెస్ డెవలప్‌మెంట్ సొసైటీ డైరెక్టరు జనరల్-డా.టి.వి.ఆర్.కె. ప్రసాద్ వంటి వారు చాలా బాగా ప్రతిస్పందించి తోడ్పాటు నందిస్తున్నారు. మీడియా మంచి ప్రచారాన్నదించుతున్నది. వివిధ గవర్నమెంటేతర స్వచ్ఛంద సంస్థలు (N.G.O.) ముందుకు వచ్చి ప్రోత్సాహాన్నిస్తున్నాయి. యువజన సంఘాలూ, మహిళాసంఘాలూ, రోటరీ, లైన్స్‌క్లబ్బుల వంటివి, వివిధ మత-ధార్మిక సంస్థలు, సినీ కళాకారులూ, వృత్తిసంఘాలూ, రాష్ట్ర, జిల్లాస్థాయిలో అసోసియేషన్‌లుగా ఏర్పడి ప్రోత్సహిస్తున్నాయి. ఆంధ్రప్రదేశ్ వుమెన్స్ కో-ఆపరేటివ్ ఫైనాన్స్ కార్పొరేషన్ వారు 10 జిల్లాల్లోని 1200 మంది బాలికలకు ప్రత్యామ్నాయం కల్పించుతున్నారు.

ప్రమాదభరితమైన పనులలో పనిచేసే బాలకార్మికులపై కూడా శ్రద్ధ వహిస్తున్నాము. ప్రకాశం జిల్లాలోని మార్కాపురంలో పలకల పరిశ్రమల్లో పనిచేసే 5412 మంది పిల్లలను పాఠశాలలో చేర్పించాము. 2340 మంది పిల్లలకు ట్రెడిషనల్ విద్యా సంస్థలలో చదువు చెప్పించుతున్నాము.

కార్మిక లోకం
సి.ఐ.టి.యు. ఆంధ్రప్రదేశ్ కమిటీ మాసపత్రిక
సంపుటి 18 సంచిక 1
విడి ప్రతి వెల 5 రూ॥
జనవరి 2002

విషయసూచిక





# మహాభినిష్క్రమణం

"నకర్మణా, న ప్రజయా, న ధనేన
త్యాగేనైకేన అమృతత్వ మానసు :"

(తనకు పేరు ప్రతిష్టలు కలగాలని చేసే పనులవల్లగాని, డబ్బువల్లగాని కాక, కేవలం త్యాగము వల్లనే ఒక వ్యక్తి చిరస్థాయిగా గుర్తుంచుకోబడ్తాడు)

కైవల్యోపనిషత్‌లోని ఈ శ్లోకానికి కా॥ నండూరి ప్రసాద రావు గారి జీవితం ఒకసాకార నిర్వచనమంటే అతిశయోక్తి కాదేమో. "జాతస్య మరణధృవం" అనేది ప్రకృతి సహజమేనైనా, కొందరు గతించినపుడు ఆ ప్రకృతి నియమాలు అబద్ధమైతే ఎంత బాగుండునో ననిపిస్తుంది. ఆకారంలోనే గాక వ్యక్తిత్వంలోను ఆజానుబాహువైన కా॥ ఎన్.పి.ఆర్. మరణంతో ఒక గైడ్‌ను, ఒక మహానాయకుడ్ని, ఒక గొప్ప సిద్ధాంత వేత్తను-ఒక్క మాటలో చెప్పాలంటే ఒక పెద్ద దిక్కును కోల్పోయిన సిఐటియు కార్యకర్తలు, 'కార్మిక లోకం' పై విధంగా భావించడంలో తప్పేముంది?

ఒకటి కాదు, రెండు కాదు, పీడిత ప్రజాసేవలో ఏడు పదుల సుదీర్ఘ మహా ప్రస్థాన మాయనది. కుదుపులు, కష్టాలు ఆయన లక్ష్యాన్ని చెదర గొట్టలేక పోయాయి. బ్రిటిష్ సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాట వెల్లువలో యువత ఉర్రూతలూగుతున్న దశలో కమ్యూనిస్టు ఉద్యమం వైపు ఆకర్షితులైనారు. ఆ వైపుగా తన తొలి అడుగు వేసిన కా॥ ప్రసాద రావు గారు, తన తుది శ్వాస విడిచే వరకు ఆధునిక మార్క్సిస్టు పార్టీ అగ్రనేతల్లో ఒకరిగా ఎదిగారు.

సామ్రాజ్య వాదాన్ని దానికి మొనగాడుగా నిలిచిన అమెరిక దోపిడీ యెడల అత్యంత నిశితంగా వుండే వారు. సామ్రాజ్య వాదకోటతుది బురుజుల్ని తన చేతుల మీదుగానే కూలదోయాలన్నంత పట్టుదలే బహుశా ఆయనకు మరి కొంత ఊపిరూదిందేమో ! ఆయన్ని ముసలి యువకుడని ఒకాయన చమత్కరించారు. ఆయన ఆరోగ్య చిట్కాలు చెప్పమని ఒకసారడిగితే "ఆశయబలం వుంటే ఆరోగ్యం దేముంది రా !" అంటూ చిరునవ్వు నవ్వారు.

ఎంత సంక్షోభ సమయంలోనైనా, సంక్లిష్ట సమస్యలొచ్చినా ఉద్రిక్తలకు లోను గాకుండా, స్థిమితంగా ఉండగలగటం అవకాశముంటే హాస్యోక్తులతో పరిష్కారం చెప్పగలగటం ఆయన ప్రత్యేకత. మార్క్సిస్టు మూల సూత్రాల నుండి క్రికెట్ ఆట వరకు ఔపోసన పట్టిన మేధావి కా॥ ఎన్.పి.ఆర్. కళలు, సాహిత్యం, పురాణాలు, ఇతిహాసాలు ఆయనకు కరతలామలకం. ఈసావాస్యో పనిషత్ మొదలు మొత్తం ఉపనిషత్తులు వేదాలు కూడా అధ్యయనం చేసిన పండితుడాయన. విశ్వనాధ, చిలకమర్తి, పానుగంటి, బలిజేపల్లి లక్ష్మికాంతం వంటి ఆధునిక తెలుగు కవులంతా ఆయనకు పిలిస్తే పలికే నేస్తాలు. ఆయన రచనల్లో విస్తారంగా కన్పడే తెలుగు వాఙ్మయమే ఆయన మేధోసంపత్తికి నిలువెత్తు నిదర్శనం.సెప్టెంబర్ 12 న తీవ్ర అస్వస్థతకు లోనై మంచం పట్టినా నవంబర్ 1 న ఆయన వ్రాసిన వ్యాసం విశ్వానాధ వారి పద్యంతో మొదలైన తీరు చూసి ఆయన జ్ఞాపక శక్తికి, భాషా సంపత్తికి జోహార్లర్పించ కుండా ఎవరైనా ఉండగలరా?

స్వాతంత్రానికి పూర్వమే రైతు సంఘ నాయకుడిగా మునగాల జమీందారు వ్యతిరేక పోరాటంలో రాటుదేలి, అఖిల భారత కిసాన్ సభ ప్రధాన కార్యదర్శిగా, స్వాతంత్రానంతరం కొంతకాలం ఆంధ్ర ప్రదేశ్ వ్యవసాయ కార్మిక సంఘ నాయకునిగా కూడా ఆయన పనిచేశారనే విషయం బహుశా ఆయన చనిపోయే వరకు చాలా మంది సిఐటియు కార్యకర్తలకు తెలియదు. పై పై పరిశీలన గాక తమకివ్వబడ్డ బాధ్యత దేన్నయినా సమర్ధవంతంగా నిర్వహించటం , అందుకవసరమైన లోతైన అధ్యయనం చేయటం ప్రస్తుత తరం ఆయన్ని చూసి నేర్చుకోవల్సిందే.

ఉద్యమావసరాల రీత్యా టి.యు రంగానికి కేటాయించబడ్డ కా॥ ప్రసాద రావు గారు సిఐటియు అత్యున్నత నాయకుల్లో ఒకరిగా ఎదిగారు. 30 సం॥లు రాష్ట్ర ప్రధాన కార్యదర్శిగా ఆయన వ్యూహాత్మక పట్టణాలు, పరిశ్రమలు, రంగాలు ఎంచుకొని కృషి చేయడం ఒకెత్తైతే, అందుకవసరమైన కార్యకర్తలను ఎంపిక చేసి పనిలో నిలపడం మరోఎత్తు. కార్మిక వర్గ ఐక్యత కోసం పరితపించిన వ్యక్తుల్లో కా॥ నండూరి ప్రసాద రావు గారు ఒకరు. ఆ తపనే, మరణశయ్య పై నున్నా ఆయన ఆర్.టి.సి సమ్మెను అడుగడుగునా "ఫాలో" అయ్యేలా చేసింది.

ఆయన నిరాడంబరత, నమ్రత నేటి తరానికి ఆదర్శం. ఆయన జీవిత చరిత్ర రాద్దామని, రాస్తామని చాల కాలంగా రాష్ట్ర కేంద్రం అడుగుతున్నా, రాయాల్సినంత గొప్ప చరిత్రేమి లేదని నవ్వుతూ సమాధానం చెప్పటం ఆయన మహోన్నత వ్యక్తిత్వానికి మచ్చుతునక. చివర్లో మా వత్తిడికి తలొగ్గినా, మృత్యువాయన్నె గరేసుకు పోయింది.

"నాయకులు పుట్టరు. తయారౌతారు!" అనేది ఎన్.పి.ఆర్ విషయంలో అక్షరసత్యం. ఒకటి రెండు మంచి లక్షణాలుంటేనే ఎగిరెగిరి పడే కొందరు నేటి తరం కార్యకర్తలు నిండు విస్తరిలా, లోతైన సంద్రంలా పరిపూర్ణ జీవితం గడిపిన కా॥ ప్రసాద రావు గార్ని చదవాలి అర్థం చేసుకోవాలి.

కా॥. నండూరి వంటి మహామనీషులు రాలిపోయినప్పుడు "a colossus has fallen" అని 18వ శతాబ్దపు ఇంగ్లీషు కవి అన్న విషయం ఎంత సత్యమో అనిపిస్తుంది.

భారత దేశంలో కార్మిక వర్గ రాజ్యాన్ని స్థాపించడం, ప్రపంచ వ్యాపితంగా సామ్రాజ్య వాదానికి ఘోరి కట్టడమే మనమాయనకిచ్చే నివాళి.

# ఆంధ్రప్రదేశ్‌లో బాలకార్మిక సమస్య - స్వరూప స్వభావాలు

**బాల కార్మికులంటే ఎవరు :** 14 సంవత్సరాలలోపు పని చేస్తున్న పిల్లలందరినీ బాల కార్మికులుగా పేర్కొనవచ్చు. ఈ పని జీతం కోసం కావచ్చు లేదా కుటుంబంలో జీతం లేకుండా చేస్తున్న పని కావచ్చు. భారత రాజ్యాంగం ప్రకారం 14 సం॥లోపు పిల్లలందరికీ నిర్బంధ విద్య ఇవ్వాల్సిన బాధ్యత కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలపై ఉంది. దీన్ని ఆధారంగా చేసుకొని ఈ మధ్య రాష్ట్ర ప్రభుత్వం బడి ఈడు ఉండి బయట ఉన్న పిల్లలందరూ బాల కార్మికులే అనే చారిత్రాత్మక నిర్ణయం తీసుకుంది.

**మన రాష్ట్రంలో ఎంతమంది బాల కార్మికులున్నారు.**

దురదృష్టవశాత్తు మొత్తం భారతదేశంలో అత్యధిక సంఖ్యలో బాలకార్మికులు మన రాష్ట్రంలోనే ఉన్నారు. 1991 జనాభా లెక్కల ప్రకారం 16 లక్షల 61వేల మంది బాలకార్మికులు మన రాష్ట్రంలో ఉన్నారు. జిల్లాల వారీగా ఈ బాల కార్మికుల సంఖ్యను 3వ పేజీలో గల పట్టికలో చూడగలరు.

బాలురకంటే, బాలికలు అధిక సంఖ్యలో పని చేస్తూ ఉండటాన్ని మనం ఇక్కడ గమనించాలి.

**ఈ బాల కార్మికులు ఏ ఏ రంగాలలో ఉన్నారు.**

అధిక సంఖ్యలో బాలకార్మికులు (79%) వ్యవసాయరంగంలో వ్యవసాయ కూలీలుగా,సొంత వ్యవసాయంలో కుటుంబ సభ్యులతో కలసి పనిచేసే వారిగా, పశువుల కాపర్లుగా మరియు ఇతర గ్రామీణ వృత్తులలో పని చేస్తున్నారు.

పై వృత్తులతో పాటు అన్ని పట్టణ ప్రాంతాలలో చిన్న చిన్న దుకాణాలు, కిరాణా కొట్లు, చిన్న హోటల్స్, దాభాలు, ఆటో మెకానిక్, సైకిల్ మెకానిక్ షాపులలో పిల్లలు పని చేస్తున్నారు.

| జిల్లా | పరిశ్రమ/వృత్తి |
|---|---|
| శ్రీకాకుళం | జీడిపప్పు |
| గుంటూరు (పిడుగురాళ్ళ) | సున్నపు బట్టీలు |
| కర్నూలు (ఆధోని) | " |
| ప్రకాశం (మర్కాపురం) | ఫలకల పరిశ్రమ |
| అనంతపూర్ | (ధర్మవరం) |
| కర్నూలు, మహబూబ్‌నగర్ | హైబ్రిడ్ కాటన్‌సీడ్ |
| మెదక్, కరీంనగర్ | బీడీ పరిశ్రమ |
| నిజామాబాద్, వరంగల్ | |
| నల్గొండ, మహబూబ్‌నగర్ | |
| కడప, కర్నూలు, చిత్తూరు, నెల్లూరు | |



**డా॥ బి. శ్రీనివాస రెడ్డి**
**ప్రాజెక్టు ఆఫీసర్, ILO-IPEC**

**ఏ ఏ కారణాల వలన పిల్లలు పని చేస్తున్నారు.**

బాల కార్మిక వ్యవస్థ అనగానే తిండికి లేక పని చేసుకుంటున్నారు. మనం ఏమిచేయగలం అన్నది సగటు మనిషి ఆలోచనగా ఉంది. వాస్తవానికి ఇది అన్ని సందర్భాలలో సరికాదు. ఎందుకంటే పేదరికం ఉన్నంత మాత్రాన ప్రతి కుటుంబం పిల్లల్ని పనికి పంపుతుందని చెప్పలేం. ఒక బ్రాహ్మణ కుటుంబాన్ని ఉదాహరణగా తీసుకొండి లేదా తల్లిగాని తండ్రిగాని చదువుకున్న కుటుంబాన్ని తీసుకోండి. ఎంత పేదరికంలో ఉన్నప్పటికి, ఈ కుటుంబాలు వాళ్ల పిల్లలకి ఖచ్చితంగా కనీస విద్య (10వ తరగతి వరకైనా) చదివిస్తారు.

దీన్ని బట్టి మనం గమనించాల్సింది పేదరికం కంటే లేదా పేదరికంతో పాటు అనేక ఇతర బలమైన కారణాలు పిల్లల్ని పనికి పంపటంలో తోడ్పడుతున్నాయి. అవి ఏమిటి అని చూసినపుడు ముఖ్యంగా ఈ క్రిందివి మనం గమనించవచ్చు :

1. కుటుంబ ఆచార వ్యవహారాలు
2. తల్లిదండ్రులు నిరక్షరాస్యులు కావటం
3. తల్లిదండ్రులకు విద్యపట్ల నమ్మకం లేకపోవటం
4. కుటుంబ వృత్తి
5. కుల వ్యవస్థ
6. సమాజంలో పిల్లల పనిపట్ల ఉన్న ఉదాసీనత
7. పీస్‌రేట్ వేతనాలు
8. తల్లిదండ్రులు లేకపోవటం లేదా అనారోగ్యం
9. స్త్రీలు, బాలికల పట్ల ఉన్న నిరాదరణ, ఉపేక్ష, వివక్షత.
10. పెద్ద కుటుంబాలు (అధిక జనాభా సమస్య)
11. తల్లిదండ్రుల చెడ్డ అలవాట్లు.

పై కారణాలన్నీ పిల్లలను ఎందుకు పనికి పంపుతున్నారు (supply) అన్న దృక్కోణం నుంచి చూడవచ్చు. అయితే పిల్లలకు ఎందుకు యాజమాన్యాల నుంచి Demand ఉన్నది అన్న విషయం కూడా చాలా ముఖ్యం. అది చూసినట్లయితే కొన్ని ఈ క్రిందివి కావచ్చు.

12. పిల్లలు ఎక్కువ విధేయతగా ఉంటారనే భావన.
13. ఎన్ని గంటలైనా పని చేయడానికి సిద్ధపడటం.
14. ఎలాంటి పనైనా చేయడానికి సిద్ధపడడం.
15. తక్కువ వేతనం.
16. నమ్మకంగా, అమాయకంగా పడి ఉండడం (ముఖ్యంగా ఇళ్ళల్లో పనిచేయడానికి)
17. తిరుగుబాటు చేసే శక్తి లేకపోవడం
18. గైరుహాజరు కాకుండా రోజూ పనికి రావడం.
19. కార్మిక సంఘాలు లేకపోవడం
20. కార్మిక చట్టాలు సరిగ్గా అమలు చేయక పోవడం.

**బాలకార్మికులు పనిచేస్తే ప్రమాదం ఏమిటి?**

తిండికి గడవక పనిచేస్తే మనం ఎందుకు పిల్లల్ని పని నుండి మాన్పించాలి అన్న మనందరి భావన ఒక్కసారి అప్పుడే రక్తం తయారవుతూ ఎముకలు ఏర్పాటు అవుతున్న చిన్న పిల్లల మనస్సులోకి ప్రవేశించి చూసినట్లయితే ఆ కష్టం అర్థం అవుతుంది.

చిన్న పిల్లలు హాయిగా, ఆహ్లాదకరంగా, చదువుకుంటూ, ఆడుకుంటూ పెరగాల్సిన వయస్సులో ప్రేమానురాగాలు లేని పెద్దల మధ్య పని చేయటం వలన శారీరక,

(కొనసాగింపు 3వ పేజీలో)

(2వ పేజీ తరువాయి)

మానసిక అనారోగ్యానికి గురౌతారు. పసిప్రాయం నుండే పిల్లలు పనిచేయడం, చదువు లేకపోవడం వలన భవిష్యత్తులో వీరి సంపాదనా శక్తి క్షీణిస్తుంది.

కొన్ని రకాల వృత్తులలో వృత్తిపరమైన జబ్బులు సోకే ప్రమాదం ఉంది. పిల్లలు ప్రమాదకరమైన వృత్తులలో చిన్నప్పటినుండి పనిచేస్తున్న కారణంగా మునుముందు వారి ఉత్పాదక సామర్థ్యం తగ్గిపోతుంది. నడివయస్సులోనే ఇలాంటి వ్యక్తులు బలహీనులు కావటం సహజం. చిన్నప్పటి నుంచి బీడీలు చుడుతున్న స్త్రీలు దీనికి పెద్ద ఉదాహరణ.

శరీర నిర్మాణం, శరీర ధర్మం, మానసికస్థితి పరంగా పిల్లలకు పెద్దలకు మధ్య చాలా తేడా ఉంటుంది. అందువలన పెద్దలు చేసే పనిని పిల్లలు చేస్తున్నపుడు వృత్తిపరమైన వ్యాధుల ప్రభావం పెద్దల కంటే పిల్లల మీద ఎక్కువ ఉంటుంది. పిల్లలు అధికంగా పని చేస్తున్నపుడు, అధిక బరువుల్ని మోస్తున్నపుడు, చాలా సేపు శరీరాన్ని వంచి ఉంచాల్సి వచ్చినపుడు వాళ్ల వెన్నెముకలో వైకల్యం ఏర్పడే ప్రమాదం ఉంటుంది.

చిన్న తనం నుంచి కొన్ని వృత్తులలో పనిచేస్తున్న పిల్లల్లో ఆత్మస్థైర్యం క్షీణించడం, అకాల వృద్ధాప్యం, మానసిక సంక్షోభం వంటి సమస్యలు ఎదురవవచ్చు.

**చట్టాలు ఏమి చెబుతున్నాయి.**

14 సం॥రాల లోపు పిల్లలను దుకాణాలు, సంస్థలు, కర్మాగారాలు, గనులు, తోటలు, ఇతర ప్రమాదకర వృత్తులు, పనులలో పెట్టుకొనుట నేరం అని చట్టాలు చెబుతున్నాయి. ఆ చట్టాల వివరాలు ప్రక్క పట్టికలో చూడండి. వీటితో పాటు ఏ పనికైనా పిల్లలకు కూడా పెద్దలతో పాటు సమాన వేతనం ఇవ్వాలని కనీస వేతనాల చట్టం 1948 నిర్దేశించింది. ఈ చట్టాలు వర్తింప జేస్తూ పిల్లలకు మంచి భవిష్యత్తు చూపించడానికి **పిల్లలు బడికి - పెద్దలు పనికి** అనే నినాదంతో సమాజంలో ప్రతి ఒక్కరూ ముఖ్యంగా కార్మిక సంఘాల నాయకులు, సభ్యులు నడుంబిగించి పని చేయాల్సిన సమయం ఆసన్నమైంది.

## ఆంధ్రప్రదేశ్‌లో బాల కార్మికులు

| | జిల్లా పేరు | బాలలు | బాలికలు | మొత్తం |
|---|---|---|---|---|
| 1. | శ్రీకాకుళం | 27280 | 32675 | 59955 |
| 2. | విజయనగరం | 31377 | 31250 | 62627 |
| 3. | విశాఖపట్నం | 34940 | 35190 | 70130 |
| 4. | తూర్పుగోదావరి | 52910 | 23060 | 75970 |
| 5. | పశ్చిమ గోదావరి | 47203 | 36194 | 83397 |
| 6. | కృష్ణా | 40366 | 40881 | 81247 |
| 7. | గుంటూరు | 53040 | 65235 | 118275 |
| 8. | ప్రకాశం | 30690 | 43230 | 73920 |
| 9. | నెల్లూరు | 25033 | 26410 | 51443 |
| 10. | చిత్తూరు | 30440 | 32290 | 62730 |
| 11. | కడప | 19590 | 24172 | 43762 |
| 12. | అనంతపూర్ | 45919 | 46336 | 92255 |
| 13. | కర్నూలు | 54132 | 57905 | 112037 |
| 14. | మహబూబ్ నగర్ | 61260 | 63357 | 124617 |
| 15. | రంగారెడ్డి | 28070 | 24090 | 52160 |
| 16. | హైదరాబాద్ | 11930 | 3000 | 14930 |
| 17. | మెదక్ | 31820 | 33180 | 65000 |
| 18. | నిజామాబాద్ | 24455 | 33699 | 58154 |
| 19. | ఆదిలాబాద్ | 24740 | 30513 | 55253 |
| 20. | కరీంనగర్ | 31350 | 56213 | 87563 |
| 21. | వరంగల్ | 32790 | 42300 | 75090 |
| 22. | ఖమ్మం | 33017 | 33998 | 67015 |
| 23. | నల్గొండ | 34150 | 40260 | 74410 |
| | **మొత్తం** | **806502** | **855438** | **1661940** |

## బాలకార్మికుల నిషేధం గురించి ఉన్న చట్టాలు

| చట్టాలు | కనీస వయస్సు | వర్తింపు పరిధి (కవరేజి) (బాలకార్మికుల నిషేధం) |
|---|---|---|
| 1. చైల్డ్ (ప్లెడ్జింగ్ ఆఫ్ లేబర్) యాక్ట్ 1933 | 15 | పిల్లల శ్రమను తాకట్టు పెట్టే ఒప్పందం నిషేధించబడింది. |
| 2. ఫ్యాక్టరీస్ యాక్ట్, 1948 | 14 | అన్ని కర్మాగారాలు |
| 3. ప్లాంటేషన్ లేబర్ యాక్ట్ 1951 | 14 | తేయాకు, కాఫీ, రబ్బరు, సింకోనా యాలకులు వంటి 5 హెక్టార్ల తోటలు, 15 మంది వ్యక్తులు పని చేసేవి. |
| 4. మైన్స్ యాక్ట్ 1952 | 16/18 | భూగర్భ గనులు అన్ని రకాలవి. |
| 5. మర్చంట్ షిప్పింగ్ యాక్ట్ 1958 | 15 | అన్ని ఓడలు |
| 6. మోటారు ట్రాన్స్‌పోర్టు వర్క్ యాక్ట్ 1961 | 15 | అన్ని రకాల ప్రయాణీకుల, సరుకుల రవాణా వాహనాలు |
| 7. బీడీ, సిగార్ వర్కర్స్ యాక్ట్ 1966 | 14 | పరిశ్రమ ఆవరణలో బీడీలు, చుట్టల తయారీ |
| 8. బాల కార్మికుల (నిషేధం, క్రమ బద్ధీకరణ చట్టం, 1986 | 14 | ప్రమాదకర వృత్తులు, పనులు |
| 9. ఆంధ్రప్రదేశ్ దుకాణాలు, సంస్థల చట్టం 1988 | 14 | అన్ని దుకాణాలు, సంస్థలు |

# రాష్ట్రంలో బాల కార్మికుల పునరావాసం

మనదేశంలో బాల కార్మికుల పునరావాస కార్యక్రమాల బీజాలు 1987లో వెలువడ్డ జాతీయ బాల కార్మికుల విధానం లో పొందుపరచబడ్డాయి. జాతీయ బాల కార్మికుల విధానంలో అతిముఖ్యమైన అంశం ఎక్కువగా బాల కార్మికులు కేంద్రీకృతమై వుండే ప్రాంతాలు/రంగాలలో బాల కార్మికుల సంక్షేమానికి నిర్దిష్టమైన ప్రాజెక్టులను రూపొందించటం. దీని ఫలితంగా మొట్టమొదటి సారిగా భారతదేశంలో 1987లో 9 జాతీయ బాలకార్మికుల ప్రాజెక్టులు రాజస్థాన్, ఉత్తరప్రదేశ్, తమిళనాడు, మధ్యప్రదేశ్ మరియు ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలలో స్థాపించారు.



**డా॥ఎం.మురళీకృష్ణ**
**ప్రాజెక్టు ఆఫీసర్, ILO-IPEC**

### జాతీయ బాల కార్మికుల ప్రాజెక్టులు

ఆంధ్రప్రదేశ్‌లో తూర్పుగోదావరి జిల్లాలోని జగ్గంపేటలో మరియు ప్రకాశం జిల్లాలోని మార్కాపురం ప్రాంతాలలో జాతీయ బాలకార్మికుల ప్రాజెక్టులు మొట్టమొదటిగా స్థాపించబడ్డాయి. జగ్గంపేటలో పెంకుల పరిశ్రమలోని బాల కార్మికుల పునరావాసానికి మరియు మార్కాపురంలో పలకల పరిశ్రమ బాలకార్మికుల పునరావాసానికై ఈ ప్రాజెక్టులు స్థాపించబడ్డాయి. ఈ ప్రాజెక్టుల్లో భాగంగా బాలకార్మికులను గుర్తించి వారి పునరావాసానికై ప్రత్యేక పాఠశాలలు స్థాపించి అనియత విద్యను, వృత్తివిద్యా శిక్షణను అందించారు.

ఈ ప్రాజెక్టులు ఐదేళ్ల పాటు (1993 వరకు) పనిచేసిన తరువాత భారత ప్రభుత్వం ఈ ప్రాజెక్టుల పనితీరును పరిశీలించిన పిమ్మట ఆగస్టు 1995లో జాతీయ బాలకార్మికుల ప్రాజెక్టులను ఇతర ప్రాంతాలకు, రాష్ట్రాలకు విస్తరించాలని నిర్ణయించింది.

దీని పర్యవసాన్యంగా మన రాష్ట్రానికి, బాలకార్మిక పునరావాసానికి రాష్ట్ర ప్రభుత్వం ప్రత్యేక శ్రద్ధ కనబర్చడం వలన కొత్తగా 19 జాతీయ బాలకార్మిక ప్రాజెక్టులు మన రాష్ట్రంలో స్థాపించబడ్డాయి. మొత్తం 23 జిల్లాలకుగాను, కృష్ణాజిల్లా మినహా ప్రస్తుతం మిగిలిన అన్ని జిల్లాల్లోను జాతీయ బాలకార్మికుల ప్రాజెక్టులు పనిచేస్తున్నాయి. ప్రస్తుతం మనరాష్ట్రంలో ఈ ప్రాజెక్టుల కింద దాదాపు 1100 ప్రత్యేక పాఠశాలలు నిర్వహింపబడుతున్నాయి. (వివరాలకు పట్టిక చూడండి) ఏటా రమారమి 1,00,000 మంది బాలకార్మికుల పునరావాసం జరుగుతుంది. ఇప్పటి వరకు 3,50,000 మంది బాల కార్మికులకు పునరావసం కల్పించారు. ఈ పాఠశాలల్లో అనుబంధ పౌష్టికాహారం, ఆరోగ్యసంరక్షణ సేవలతో పాటు అనియత విద్యను, వృత్తివిద్యా శిక్షణను అందిస్తారు.

రాష్ట్ర ప్రభుత్వపరంగా బాలకార్మికుల వ్యవస్థ నిర్మూలించుటకు గాను కొన్ని వినూత్నమైన విధానాలను, పథకాలను రూపొందించి 1997 నుండి అమలు పరుచుచున్నది.

### మళ్ళీబడికి పథకం :

రాష్ట్ర ప్రభుత్వం బాలకార్మిక సమస్య నిర్మూలనకు ప్రాథమిక విద్యా వ్యవస్థను శక్తివంతం చేయటం, 5-14 సంవత్సరాల బాలబాలికలను పాఠశాలలో వుంచటమే సరియైన మార్గంగా భావించి 1997లో సాంఘిక సంక్షేమ శాఖ ద్వారా "మళ్ళీబడికి" అనే పథకం ప్రారంభించింది.

ఈ పథకం క్రింద బాలకార్మికులను మరియు పాఠశాలకు రాని పిల్లలను గుర్తించి, వారికి రెండు నుంచి మూడు నెలల వరకు సాంఘిక సంక్షేమ హాస్టళ్లలో అనియత విద్య బోధించి, వారిని తిరిగి పాఠశాలల్లో చేర్పించడం జరుగుతుంది. ఈ పథకం క్రింద దాదాపు మూడు లక్షల బాలబాలికలను పునరావాసం చేయడం జరిగింది.

### సమగ్ర బాలికా కార్మిక పునరావాస పథకం

ఆంధ్రప్రదేశ్ మహిళా సహకార ఆర్థిక సంస్థ ద్వారా ప్రమాదకర పనులలో పనిచేస్తున్న బాలికల పునరావాసం కోసం రాష్ట్ర ప్రభుత్వం సమగ్ర బాలికా కార్మిక పునరావాస పథకం ప్రారంభించింది. ఈ పథకం క్రింద బాలికా కార్మికులను గుర్తించి, జిల్లాలో నెలకొల్పిన తెలుగు బాల మహిళా ప్రగతి ప్రాంగణాలలో రెసిడెన్షియల్ పునరావాస కార్యక్రమాలను నిర్వహిస్తున్నది. ఈ పథకం క్రింద బాలికలకు అనుబంధ పౌష్టికాహారం, ఆరోగ్య సంరక్షణ సేవలతో పాటు అనియత విద్యను బోధించి వారిని వివిధ పాఠశాలల్లో చేర్పించడం జరుగుతుంది. 1997 నుండి ఇప్పటి వరకు దాదాపు 5,500 బాలికలకు పునరావాసం కల్పించడం జరిగింది.

### జిల్లా ప్రాథమిక విద్యా పథకం :

రాష్ట్ర ప్రభుత్వం ప్రాథమిక విద్యను శక్తిపరచడం ద్వారా బాలకార్మిక సమస్య నిర్మూలనకు విశేష కృషి జరుపుతోంది. 1997 నుండి 2000 వరకు బాలకార్మికుల కోసం దాదాపు 630 ప్రత్యేక సెంటర్స్‌ను నెలకొల్పి వారికి బ్రిడ్జి కోర్సులు బోధించి వారికి పునరావాసం ఏర్పాటుచేసింది. 2000 వ సం॥ నుండి, సార్వత్రిక ప్రాథమిక విద్యా పథకం ద్వారా

100 మండలాల్లో బాలకార్మిక నిర్మూలన కోసం కృషిజరుపుతోంది. 2001-2002 నుండి ఎడ్యుకేషన్ గ్యారెంటి స్కీమ్ ద్వారా సాంఘిక సేవా సంస్థలకు కూడా ప్రాథమిక విద్యలో భాగస్వామ్యం కల్పిస్తూ ప్రాథమిక విద్యను శక్తి వంతం చేస్తూ బాలకార్మిక నిర్మూలన కొరకు విధివిధానాలను రూపకల్పన చేస్తోంది.

### అంతర్జాతీయ కార్మిక సంస్థ

అంతర్జాతీయ కార్మిక సంస్థ ఆంధ్రప్రదేశ్ బాలకార్మిక నిర్మూలన ప్రాజెక్టు ద్వారా 2001-2002లో రాష్ట్రంలోని ఐదు ప్రాంతాలలో-హిందూపురం, కుప్పం, మార్కాపురం, విశాఖపట్టణం మరియు మహబూబ్‌నగర్‌లలో బాలకార్మిక నిర్మూలనా కొరకు స్వచ్ఛంద సంస్థలు మరియు ప్రభుత్వ భాగస్వామ్యంతో ప్రత్యేక ప్రాజెక్టులు ప్రారంభించింది. రాష్ట్ర ప్రభుత్వం 2004 లోపుగా బాలకార్మిక వ్యవస్థను నిర్మూలించాలని లక్ష్యంగా భావించింది. అందుకోసం రాష్ట్ర శాసనసభలో మార్చ్ 29, 2001న నిర్దిష్టమైన తీర్మానంగా కూడా ఆమోదించింది.

ఈ లక్ష్యానికి అనుగుణంగా బాలకార్మిక నిర్మూలన బాధ్యతలను ప్రాథమిక విద్యాశాఖకు అప్పగించింది.

ప్రభుత్వంతో పాటు రాష్ట్రంలోని స్వచ్ఛంద సంస్థలు, కార్మిక సంఘాలు, యాజమాన్య సంఘాలు, సాంఘిక సేవాసంస్థలు కలసికట్టుగా పనిచేసిన నాడు బాలకార్మిక సమస్యను సమర్థవంతంగాను, వేగంగాను నిర్మూలించడానికి అవకాశాలు ఎక్కువగా వున్నాయి.

### స్వచ్ఛంద సేవా సంస్థలు :

మన రాష్ట్రంలో బాలకార్మికుల పునరావాసం మరియు నిర్మూలనలో అనేక స్వచ్ఛంద సంస్థలు ప్రధాన పాత్ర పోషిస్తున్నాయి.

మామిడిపూడి వెంకటరంగయ్య ఫౌండేషన్-రంగారెడ్డి, నల్గొండ ఇతర జిల్లాల్లో 1991 నుండి విశేష స్థాయిలో బాలకార్మిక నిర్మూలనకు కృషిసలుపుతోంది. డాక్టర్.రెడ్డీస్ ఫౌండేషన్-హైదరాబాద్,రంగారెడ్డి జిల్లాలలో, రూరల్ డెవలప్‌మెంట్ ట్రస్ట్-అనంతపురం జిల్లాలోనూ, భాగవతుల చారిటబుల్ ట్రస్ట్-విశాఖపట్నం జిల్లాలోను మరియు ఇతర అనేక సంస్థలు బాలకార్మిక నిర్మూలనకు, ప్రాథమిక విద్యా అభివృద్ధికి విశేషంగా పాటుపడుతున్నాయి. ❀

## ఆంధ్రప్రదేశ్‌లో ఎన్‌సిఎల్‌పి పాఠశాలలు

| క్రమ సంఖ్య | జిల్లా | పాఠశాలల సంఖ్య | చేరుకున్న పిల్లలు |
|---|---|---|---|
| 1. | అనంతపూర్ | 60 | 3000 |
| 2. | ఆదిలాబాద్ | 40 | 2000 |
| 3. | చిత్తూరు | 40 | 3000 |
| 4. | కడప | 40 | 2000 |
| 5. | తూర్పుగోదావరి | 40 | 2000 |
| 6. | గుంటూరు | 29 | 1500 |
| 7. | హైదరాబాద్ | K 265 | 30000 |
| 8. | కరీంనగర్ | 34 | 1700 |
| 9. | ఖమ్మం | 27 | 1350 |
| 10. | కర్నూలు | 93 | 4550 |
| 11. | మెదక్ | 37 | 1850 |
| 12. | నల్గొండ | 13 | 650 |
| 13. | నెల్లూరు | 22 | 1250 |
| 14. | నిజామాబాద్ | 30 | 1413 |
| 15. | ప్రకాశం (మార్కాపూర్) | 20 | 2000 |
| 16. | రంగారెడ్డి | 70 | 3500 |
| | ఎం.వి. ఫౌండేషన్ (రంగారెడ్డిజిల్లా) | 50 | 2500 |
| 17. | శ్రీకాకుళం | 40 | 2000 |
| 18. | విజయనగరం | 40 | 2000 |
| 19. | విశాఖపట్నం | 70 | 3500 |
| 20. | మహబూబ్‌నగర్ | 60 | 3000 |
| 21. | వరంగల్ | 60 | 3000 |
| 22. | పశ్చిమగోదావరి | 21 | 1050 |
| | ఆంధ్రప్రదేశ్ మొత్తం | 1201 | 77813 |

K యు.ఎన్. సహకారంతో

# బాల కార్మిక వ్యవస్థపై కార్మికులను చైతన్య పరచాలి

డా॥ కె. హేమలత
కార్యదర్శి,
సి.ఐ.టి.యు

బాలకార్మిక వ్యవస్థ పట్ల కార్మికులలో సరయిన అవగాహనను కలిగించవలసిన బాధ్యతను ట్రేడ్ యూనియన్లు చేపట్టాలి. ఈ సామాజిక సమస్యకు తక్షణ పరిష్కారం కోసం కృషి చేస్తూనే శాశ్వత పరిష్కారం దిశగా కార్మికులను చైతన్య పరచి కదిలించవలసి వున్నది.

బాల కార్మికులు అభివృద్ధి చెందుతున్న దేశాలలోనే గాక అమెరికా, బ్రిటన్ వంటి అభివృద్ధి చెందిన దేశాలలో కూడా వున్నారు. తరతమ బేధాలు వుండవచ్చు. బాల కార్మిక వ్యవస్థ పెట్టుబడి దారీ విధాన విష పుత్రికగా అవతరించింది.

**బాలకార్మిక వ్యవస్థ-కారణాలు**

బాలకార్మిక వ్యవస్థకు ప్రధాన కారణం పేదరికం. ఏ తల్లిదండ్రులు కూడా తమ పిల్లల్ని బడికి పంపించకుండా పనికి పంపించాలని తమంత తాముగా కోరుకోరు. పేదరికం వారిని ఆ పరిస్థితులలోకి నెడుతుంది. ఈ అవగాహనను కార్మికులలో కలిగించాలి.

వ్యవసాయ రంగంలో, అసంఘటిత రంగంలో కనీస వేతనాలు కూడా అమలు కావటం లేదు. సామాజిక సంక్షేమ సౌకర్యాలు అసలే అందుబాటులో లేవు. వీటికి తోడు నిరుద్యోగం తాండవిస్తున్నది. ఇవన్నీ కూడా కలిపి బాల కార్మిక వ్యవస్థ పెరుగుదలకు కారణమవుతున్నాయి.

సరళీకరణ, ప్రపంచీకరణ విధానాలు వచ్చిన తరువాత పట్టణ, గ్రామీణ ప్రాంతాలలో నిరుద్యోగం హద్దులు లేకుండా పెరిగిపోతున్నది. ఫలితంగా అతి స్వల్ప వేతనాలపైన పని చేయుటానికి పిల్లలు లేబర్ మార్కెట్‌లోకి బలవంతంగా నెట్టబడుతున్నారు.

పెద్ద సంఖ్యలో వుండే గ్రామాలలో, పట్టణాలలోని మురికివాడలలో సరయిన స్కూల్సు వుండటం లేదు. ప్రభుత్వాలు తమ ఖర్చును తగ్గించుకోవాలనే తాపత్రయంలో వుపాధ్యాయుల ఖాళీలను భర్తీ చేయటం లేదు. వుద్యోగం వస్తుందనే గ్యారంటీ లేక పోవటం కూడా పిల్లలను పనికి పంపటానికి కారణమవుతున్నది. ఈ రోజున బాల కార్మికులలో ఎక్కువ భాగం దళితులకు చెందినవారు. దళితులపై నేటికీ కొనసాగుతున్న సాంఘిక అణచివేత వారి పిల్లలు బడికి పోవటానికి పెద్ద ఆటంకంగా వున్నది.

**బాల కార్మిక వ్యవస్థ - పర్యవసానాలు.**

లేబర్ మార్కెట్‌కు వచ్చిన పిల్లలకు



కనీసవేతనాల కంటే కూడా అనేక రెట్లు తక్కువ వేతనాలు చెల్లిస్తున్నారు. బాల కార్మికులకు కనీస వేతనాలు చెల్లించాలని చట్టంచెపుతున్నా పట్టించుకునే నాధులు లేరు. లాభాల వేటలో వుండే యజమానులు చట్టాలను తృణీకరిస్తున్నారు. వారిలో అపరాధం చేస్తున్నామనే భావన ఏ కోశానా కనబడటం లేదు.

బాల కార్మిక వ్యవస్థ వలన పెద్ద కార్మికుల బేరసారాల శక్తికి అనేక రంగాలలో హాని కలుగుతున్నది. పెద్దలకు బదులుగా చౌకగా దొరికే బాల కార్మికులను పెట్టుకుని కోట్లాది రూపాయలను యజమానులు గడిస్తుంటే కార్మిక కుటుంబాలు మాత్రం మరింత పేదరికంలోకి పోతున్నాయి.

**చిత్తశుద్ధి లేని పాలకులు**

అభివృద్ధి చెందని దేశాలలో పనిలో చేరే పిల్లల కనీస వయసు 14 సం॥లు ఉండాలని అంతర్జాతీయ కార్మిక సంస్థ (ఐ.ఎల్.ఓ) ఒప్పందం నెం. 138 నిర్దేశిస్తుంది. మన దేశం దీన్ని ఇంత వరకు ఆమోదించలేదు. ఫ్యాక్టరీస్, మైన్స్, ప్లాంటేషన్, మోటార్ ట్రాన్స్‌పోర్టు, బీడి తదితర చట్టాలలో బాల కార్మికులను పనిలో పెట్టుకోటానికి కొన్ని పరిమిత హద్దులు విధించబడ్డాయి. 1986 బాలకార్మికుల (నిషేధం మరియు క్రమబద్ధీకరణ) చట్టం ఈ కొద్ది పాటి హద్దులను కూడా నిర్వీర్యం చేసింది.

దారుణమయిన బాల కార్మిక పద్ధతుల ఒప్పందం 1999 (ఐ.ఎల్.ఓ) 18 సం॥ల లోపు పిల్లలను ప్రమాదకర పనులు, అనైతిక పనులలో పెట్టటాన్ని నిషేధించింది. దీన్ని మన ప్రభుత్వం ఆమోదించినా ఆచరణ అరకొరగా వుంది.

**పరిష్కారాలు**

బాల కార్మికుల సమస్య కేవలం మానసిక ఉద్వేగానికి సంబంధించిన సమస్యకాదు. ఇది క్లిష్టతరమయిన సమస్య. మత విశ్వాసపరమయిన కోరికలతోనో, చట్టాలు జారీ చేస్తేనో, తల్లిదండ్రులను నిందిస్తేనో ఈ సమస్య పరిష్కారం కాదు. ఈ సమస్యకు పరిష్కారం ప్రభుత్వ విధానాలతో ముడిపడి వుంది.

ఉపాధి కల్పన, భూసంస్కరణలు చేపట్టడం, అసంఘటితరంగ కార్మికులకు సరిపోను జీవన వేతనాల గ్యారంటీ, ఉమ్మడి బేరసారాల శక్తికి అవసరమయిన హక్కులను కల్పించటం తదితర విధానాలను ప్రభుత్వం చేపట్టకుండా బాల కార్మిక వ్యవస్థ రద్దుకాదు.

**సి.ఐ.టి.యు కృషి**

అసంఘటిత రంగంలో ప్రధానంగా బాలకార్మికులు కేంద్రీకృతమయి వున్నారు. బాల కార్మికుల తల్లిదండ్రులలో కూడా అధిక భాగం అసంఘటిత రంగానికి చెందినవారే. కాబట్టి కార్మికుల పని పరిస్థితులకి, జీవన పరిస్థితులకి నేరుగా బాలకార్మిక వ్యవస్థ సమస్య ముడిపడి ఉంది. కావున బాలకార్మికుల సమస్య పట్టనట్లుగా వుండే దానికి ట్రేడ్ యూనియన్లకి అవకాశం లేదు.

ఈ అవగాహనతో సి.ఐ.టి.యు బాల కార్మిక వ్యవస్థ సమస్య మీద పని చేస్తున్నది. ఐ.ఎల్.ఓ కార్యక్రమాలను నిజాయితీతో అమలు చేస్తూనే, బాలకార్మిక వ్యవస్థ పట్ల తనకువున్న భావనను సి.ఐ.టి.యు కార్మికులలోకి తీసుకెళ్ళి తగిన అవగాహన కల్పిస్తుంది.

ఐ.ఎల్.ఓ సహకారంతో 14 రాష్ట్రాలలోని 9 పరిశ్రమలలో బాల కార్మిక వ్యవస్థ పై మొదటి ప్రాజెక్టు అమలును సి.ఐ.టి.యు విజయవంతంగా పూర్తి చేసింది. జాతీయంగా, రాష్ట్రాల వారీగా, పరిశ్రమల వారీగా వర్క్‌షాపులను, సెమినార్లను సదస్సులను నిర్వహించింది. సమస్యల పరిష్కారం కోసం బాలకార్మికులను సంఘటితపరచింది. మహారాష్ట్ర, బెంగాల్, త్రిపుర సి.ఐ.టి.యు కమిటీలు తమ కృషి కొనసాగింపులో భాగంగా అసంఘటిత రంగంలోని బాల కార్మికులకు స్కూళ్ళను నడుపుతున్నాయి. ఐ.ఎల్.ఓ సహకారంతో సి.ఐ.టి.యు మరో కార్యక్రమాన్ని చేపట్టింది. ఆంధ్రప్రదేశ్‌తో సహా పది రాష్ట్రాలలో కార్మికులకు అనియత విద్యా కేంద్రాలను నడుపుతున్నది.



# బాల కార్మిక వ్యవస్థ నిర్మూలన రాష్ట్రంలో ట్రేడ్ యూనియన్ల కృషి

డా॥ బి. శ్రీనివాస రెడ్డి
ప్రాజెక్టు ఆఫీసర్, ఐ.ఎల్.ఓ- ఐ.పి.ఇ.సి.

ప్రభుత్వ అంచనాల ప్రకారం ఆంధ్రప్రదేశ్‌లోనే 16 లక్షల మంది బాల కార్మికులున్నారు. మా అంచనాల ప్రకారం ఈ సంఖ్య కూడా తక్కువే. ఇంకా ఎక్కువ మందే బాలకార్మికులుగా వుంటారు.

ఇంత పెద్ద మొత్తంలో బాలలు పని చేస్తుండటం వల్ల 3 రకాలుగా అనర్థాలు జరుగుతున్నాయి.

1. బాలకార్మికులు పెద్దమొత్తంలో పని చేస్తుండటంతో ఆ మేరకు పెద్దలకు పనులు లభించటం లేదు.
2. బాల కార్మికులతో పనులు చేయించటం వల్ల "పనిగంటలు-" ఇన్ని అనే కాల నిర్ణయం వుండదు. రోజంతా పని చేయించుకుంటూనే వుంటారు.
3. కనీస వేతనాలు అమలు జరుపకుండా తక్కువ కూలితోనే బాలబాలికలతో పని చేయించుకుంటారు.

పై మూడు కారణాల రీత్యా బాల కార్మికులు పని నుండి నిషేధించబడితే పెద్దలకు అదనపు ఉపాధిలభిస్తుంది. పని గంటల నియమం ఏర్పడుతుంది. కనీసవేతనాలు అమలు జరపటానికి అవకాశాలు ఏర్పడతాయి.

ఈ కారణాల చేతనే ఎటువంటి సంకోచాలూ లేకుండా బాలకార్మికుల వ్యవస్థను నిషేధించి వారి సంక్షేమానికి పని చేయటానికి ట్రేడ్ యూనియన్‌లు అంగీకరించాయి. ఈ కార్యక్రమంలో పని చేయటానికి ముందుకొచ్చాయి. **'పిల్లలు బడికి -పెద్దలు పనికి'** అనేది ఒక చక్కని నినాదం. ఈ నినాదం పై పని చేయటానికి ట్రేడ్ యూనియన్‌లు కదిలాయి. బాల కార్మిక వ్యవస్థ నిర్మూలన కోసం ట్రేడ్ యూనియన్‌లు ప్రత్యక్షంగా పాల్గొనటం ఆహ్వానించదగిన పరిణామం. దీని వల్ల వారి వారి కుటుంబాలకు చెందిన బాల బాలికలను చదువులకు పంపుతారు. ప్రస్తుతం బాల కార్మికులు పనిచేసే ఖాళీలలో తప్పని సరిగా పెద్దలకు పని చేసే అవకాశాలు లభిస్తాయి. ఇది మొదటి అంశం.

పిల్లలతో పని గంటల నియమితం లేకుండా పని తీసుకుంటూ వుంటారు. పెద్దలు పని చేస్తే పని గంటలు నియంత్రించబడ్తాయి. పిల్లలకు కనీస వేతనాలివ్వరు. తక్కువ వేతనాలనే చెల్లిస్తారు. పెద్దలకైతే కనీస వేతనాలివ్వవలసి వుంటుంది. ఇది రెండవ అంశం.

రాష్ట్రంలో 6 కార్మిక సంఘాలు ఎ.ఐ.టి.యు.సి, సి.ఐ.టి.యు, బి.యం.యస్, హెచ్.యం.యస్, ఐ.ఎన్.టి.యు.సి, టి.ఎన్.టి.యు.సిలు ఐ.ఎల్.ఓ తో బాలకార్మిక వ్యవస్థ పై సంప్రదింపులు జరిపాయి. ఒక కార్యక్రమ ప్రణాళికను రూపొందించారు. దాని ప్రకారం జిల్లాలను ఎంచుకొని 50 వేల మంది కార్మికులను చైతన్య పర్చటానికి పని చేయటం, పిల్లలతో పనులు జరుగకుండా నిరోధించటం వగైరాల పై కృషిని చేపట్టారు.

**ఈ క్రింది విధంగా ట్రేడ్ యూనియన్‌లు పని చేయటానికి నిర్ణయించాయి.**

| | | |
|---|---|---|
| **సి.ఐ.టి.యు** | - | **రంగారెడ్డిజిల్లా,** |
| **ఎ.ఐ.టి.యు.సి** | - | **ప్రకాశం జిల్లా,** |
| **బి.యం.యస్** | - | **హైదరాబాద్ జిల్లా,** |
| **హెచ్.యం.యస్** | - | **కరీంనగర్ జిల్లా,** |
| **ఐ.ఎన్.టి.యు.సి** | - | **నెల్లూరు జిల్లా,** |
| **టి.ఎన్.టి.యు.సి** | - | **శ్రీకాకుళం జిల్లా** |

మిగిలిన 17 జిల్లాలలో ఈ 6 కార్మిక సంఘాలు కలసి పని చేస్తాయి. దీని కోసం సమన్వయ కమిటీగా ఏర్పడి, పనిని రూపొందించుకొని పని చేస్తున్నాయి. ప్రతి 3 జిల్లాలకు ఒక యూనియన్ నాయకత్వం వహిస్తోంది. దీని కోసం పథకం రూపొందించారు.

తాము ఎంచుకున్న జిల్లాల అసంఘటిత రంగంలో వున్న కార్మికులను చైతన్య పర్చటం ద్వారా కార్మిక సంఘాలు పిల్లలను చదువుకు పంపాలనే ధ్యేయంతో పని చేస్తున్నాయి. ఇప్పటికే బాలకార్మిక వ్యవస్థ పై ట్రేడ్ యూనియన్‌లు చేస్తున్న పనికి మంచి ఫలితాలు వస్తున్నాయి. రాబోయే 15 నెలల్లో రాష్ట్ర వ్యాప్తంగా పని చేయటానికి సన్నహాలు జరుగుతున్నాయి. కార్మిక హక్కులు, కనీస వేతనాల మీద అవగాహన కల్పించటానికి కదులుతున్నారు. కార్మికులలో మంచి అవగాహన కల్పించి, వారిని ఒకశక్తిగా తయారు చేయటం ఈ ప్రోగ్రాం యొక్క ప్రధానోద్దేశ్యం. ఆయా జిల్లాలలోని కార్మిక వర్గాన్నికదిలించి కనీస వేతనాలపై కేసులు దాఖలు చేయాలి. బాలకార్మికులను పెట్టుకొని పని చేయించుకుంటున్న యాజమాన్యాలకు వ్యతిరేకంగా ఫిర్యాదులు చేయాలి. బాల కార్మిక వ్యవస్థ నిషేధించటానికి ర్యాలీలు నిర్వహించాలి. ప్రభుత్వాధికారులతో ముఖ్యంగా జిల్లా కలెక్టర్, NCLP ప్రాజెక్టు డైరెక్టర్లు, DPEP ప్రాజెక్టు కో-ఆర్డినేటర్స్, అసిస్టెంట్ లేబర్ కమిషనర్స్‌తో సమావేశాలు ఏర్పాటు చేయాలి. యాజమాన్య సంఘాలతో చర్చించి బాల కార్మికులను పనుల నుంచి రిలీజ్ చేయించాలి. ఈ పనులన్నింటికై ట్రేడ్ యూనియన్‌లు కదలనున్నాయి. కరీంనగర్, నెల్లూరుజిల్లాలలో బాల కార్మికుల కోసం కార్మిక సంఘాల ద్వారా ప్రత్యేక పాఠశాలలు నిర్వహిస్తున్నారు.

ఈ మొత్తం ప్రోగ్రాంలో 27 రంగాలలో కార్మికులను చైతన్య పర్చాటానికి కార్మిక సంఘాలు ఆచరణాత్మక కార్యక్రమాన్ని చేపడుతున్నాయి.

**ఈ ప్రోగ్రాంలో కేంద్రీకరించబడే రంగాలు :**

నిర్మాణ కార్మికులు, హమాలీలు-హెడ్‌లోడ్ వర్కర్స్,కాంట్రాక్టు కార్మికులు, వలస కార్మికులు, మట్టిపని వారు, క్వారీ కార్మికులు, స్టోన్ పాలిషింగ్ కార్మికులు, ప్రైవేట్ మోటార్ ట్రాన్స్‌పోర్టు కార్మికులు, జీడి పిక్కల కార్మికులు, బీడి & సిగార్ వర్కర్స్, మత్స్య పరిశ్రమ కార్మికులు, ఇంటిపని వారు, ఆటో మొబైల్ వర్కర్స్, హోటల్ కార్మికులు, షాప్ వర్కర్స్, హోం బేస్‌డ్ వర్కర్స్, రిక్షా కార్మికులు, ఆటో రిక్షా వర్కర్లు, కాటన్ జిన్నింగ్ వర్కర్లు, పొగాకు గ్రేడింగ్ కార్మికులు, ఇటుక బట్టీల కార్మికులు, ట్రైబల్ కార్మికులు (లంబాడీ, సుగాలీలు), ఇసుక తీసే కార్మికులు (నదుల నుండి), తోట పనివారు, వ్యవసాయ కార్మికులు, అసంఘటిత రంగంలో అనియతంగా పనిచేసే వారు.

# పెద్దలకు కనీసవేతనాలు-పిల్లలకు పలకబలపాలు

**రంగారెడ్డి జిల్లాను సిఐటియు ఎందుకు ఎంచుకుంది ?**

రంగారెడ్డి జిల్లా బాగా వెనుకబడిన ప్రాంతం. వ్యవసాయ రంగంలో సాగునీటి వనరులు లేవు. సామాజికంగా వెనుకబడిన తరగతులు ఎక్కువగా ఉండటమే గాక పేదరికంలో కార్మికులు మగ్గుతున్నారు. దీని వలన దగ్గరలో వున్న నగరానికి వలసలు పెరిగి కార్మికుల పిల్లలు విద్యకు దూరమయి పనుల్లోకి నెట్టబడుతున్నారు. సామాజిక జీవనం అస్తవ్యస్తం కావటాన్ని నిరోధించే కృషిలో భాగంగా బాల కార్మిక వ్యవస్థ పై పని చేయటానికి ఈ జిల్లాను ఎంచుకున్నాము.



**శ్రీ. డి.జి. నర్సింహారావు**
కోర్డినేటర్, ఆర్.ఆర్. జిల్లా సిఐటియు ప్రాజెక్టు

**రంగారెడ్డి జిల్లాలో బాలకార్మికులు ఏ రంగాలలో కేంద్రీకృతమయి వున్నారు?**

వ్యవసాయం (ప్రత్తి చేలు, వళ్ళతోటలు, పూలతోటలు ప్రధానంగా) క్వారీ, భవన నిర్మాణం, ఇటుక బట్టీలు, ప్రైవేటు ట్రాన్స్‌పోర్టు, హోటల్స్, మెకానికల్ షాపులు, బీడి, స్టోన్ పాలిషింగ్ రంగాలలో ప్రధానంగా వున్నారు.

**బాలకార్మిక వ్యవస్థ పై పని చేయటానికి మీరు ఎటువంటి వ్యూహాన్ని ఎంచుకున్నారు?**

తల్లిదండ్రుల ఆర్థిక పరిస్థితి మెరుగు పడితే బాల కార్మికులను చదువుకు పంపించవచ్చని సి.ఐ.టి.యు భావించింది. దీనికి పైన పేర్కొన్న రంగాలలో పెద్దలకు కనీన వేతనాలు అమలు చేయించటమనే వ్యూహాన్ని ఎన్నుకున్నాము. పెద్దలు పనికి-పనికి వెళుతున్న పెద్దలకు కనీస వేతనాలు- పిల్లలు బడికి అనే నినాదంతో ప్రాజెక్టును అమలు చేస్తున్నాము.

**ఇంతవరకు మీరు ఏమి కార్యకలాపాలు నిర్వహించారు ? ఎటువంటి అనుభవాలు వచ్చాయి ?**

వేతన స్థితి గతులు, పిల్లలు బడికి పోక పోవటానికి కారణాలు, కుటుంబ సభ్యుల సంఖ్య, సామాజిక తరగతి తదితర అంశాలపై సర్వే నిర్వహించాము. 25 మండలాలలోని 7 రంగాలలో పని చేస్తున్న 9 వేల కుటుంబాలను కలిసి వివరాలు సేకరించాము.

**భవిష్యత్ ప్రణాళిక ఏమిటి? ఎలా అమలు చేస్తారు ?**

సర్వే ఫలితాలను విశ్లేషించి వీటి ఆధారంగా కార్యక్రమ అమలుకు పూనుకుంటాము. పది వేల మంది కార్మికులను 200 మంది చొప్పున సమావేశపరచి బాలకార్మిక వ్యవస్థ దుష్ఫలితాల పై అవగాహన కలిగిస్తాము. చట్టపరంగా వుండిన కనీన వేతనాలను అమలు చేయించుకోటానికి అవసరమయిన చైతన్యాన్ని పెంచి, కార్మికులను సంఘటిత పరుస్తాము. బాల కార్మికులను పని నుండి విముక్తి చేయించి బడికి పంపించటానికి చర్యలు తీసుకుంటాము.

**కార్యక్రమం అమలుకు ఎవరి నుండి సహకారం ఆశిస్తున్నారు ?**

జ: లేబరు డిపార్ట్‌మెంటు, విద్యాశాఖ, రెవెన్యూ తదితర ప్రభుత్వ శాఖలు, ప్రజాప్రతినిధులు, గ్రామపెద్దలు, మరియు స్వచ్ఛంద సంస్థల సహకారాన్ని తీసుకుంటాము.

## పాట — నా చిట్టి చేతులు

పల్లవి : నా చిట్టి చేతులు చక్కని రాతలు నేర్వ లేదయ్యో
నా సంకల మేడితో సాలెరువ్వాలు దున్నినానయ్యో

1. నసుగన్న వాళ్ళకు ఏడేండ్లప్పుడే దూరమయ్యాను
దొరగారి ఎడ్లాకొట్టంకాడికి చేరువయ్యాను
మూడు మూరల కర్రతోక ముప్పయ్ ఎడ్లతో నేస్తం నాదయ్యో
దిక్కుదిక్కున ఉరకంగ లేలేతకాళ్ళకు గుచ్చెను ముళ్ళయ్యో ॥ నా ॥

2. వెలుగుబోయి చీకటి కమ్మినప్పుడే ఇంటికి పోతాను
నా అమ్మా అయ్యారాకముందే నిదురబోతాను
చుక్కకూకినజాముకు ఎడ్ల కొట్లం సూరుకాడుంటా
తెల్ల వెలుగులు వచ్చేటప్పుడు నీళ్ళబావికాడుంటా ॥ నా ॥

3. ఎముక ముదరని రెక్కల బరువులు మోసి నొప్పులు పెడ్తుంటే
తేపతేపకు దొరసాని రోకలిపోటుల మాటలంటుంటే
అయ్య చేసిన అప్పుల ఉచ్చులో నేను చిక్కుకున్నానే
ఆ వడ్డీ లెక్కల కంటే ఎక్కువ కష్టం చేసితినే ॥ నా ॥

4. వాళ్ళగొడ్లకు ఉలవలపిండి పెట్టి ముద్దగజూస్తారే
కడుపు కాలిన నాకు గొడ్డుకారం ముద్దలు పెడతారే
నావంటికి చిల్లులుపడ్డ చొక్కాన ఒక్కటున్నాదే
వాళ్ళ బిడ్డలవంటికి రంగుల చొక్కాలు రోజూ మారేనే ॥ నా ॥

5. పెద్దోళ్ళ బిడ్డలు ఏమి చేసిన ఎంతో ప్రచారం
నే చేసిన పనులకు ఇచ్చే బిరుదులు ఎంతో ఇకారం
చదువుకు సంధ్యకు దూరం చేసి దొరకాడుంచకురే
నా గుండెల మీద పుండును చేసే పనికీ పంపకురే
అమ్మానాన్న అందరికినే దణ్ణం పెడ్తున్నా
నను పనికి పంపక బడికి పంపమని కాళ్ళు మొక్కుతున్నా ॥ నా ॥



# యం. వెంకటరంగయ్య ఫౌండేషన్ - కృషి

(బాలకార్మికులను ప్రాథమిక విద్యలో చేర్చేందుకు కృషి చేస్తున్న సంస్థ)

పాఠశాలకు బయట ఉన్న బాలలందరూ బాలకార్మికులె. అనియత విద్యకాదు. పూర్తికాలం పాఠశాల విద్య అందించాలి. బాలకార్మిక వ్యవస్థ నిర్మూలనకు సార్వత్రిక విద్య ఇరుసువంటిది. బాలలు ఇంటిపని చేస్తున్నారా, ప్రమాదం లేని పనులు చేస్తున్నారా, కూలి లేకుండానే చేస్తున్నారా అనేది కాదు ఏపని చేసిన అది పనే అవుతుంది. బడికి బయట ఉన్నారంటేనే వాళ్ళు బాల కార్మికులు. ఏదో నియంత్రణ చేస్తాం అంటే సరిపోదు. పూర్తిగా నిర్మూలించాలి. అనేది యం.వి.ఎఫ్ దృక్పథం. ఆ సంస్థలో చదువుకుంటున్న పిల్లలతో కార్మికలోకం ప్రతినిధి రమణ ఇంటర్వ్యూ భాగం కింద ప్రచురిస్తున్నాం.



**పేరు : అంజమ్మ** **ఊరు : కల్కొడ** **వయస్సు : 14 సం॥లు**

"పిల్లలు ఎక్కువ పని చేస్తామని", "పెద్దోల్లు సరిగ్గా చెయ్యారని" మాతో చాకిరీ చెయింస్తంరు." నేను ఇక్కడకు చదువుకొన్నెకె వచ్చిన" నేను ఇక్కడ ఉన్నది తెలిసి మా వాళ్ళు క్యాంప్ మీదకు వచ్చి టీచర్లను తిట్టింంరు, కొటనికి వచ్చింంరు. నన్ను రాకుండా చెసెటందుకు బట్టలు దాసి పెట్టింంరు. ఇక్కడకు తెచ్చుకొన్న పెట్టె మా తల్లి వచ్చి గొవడ పెట్టి తీసుకుపోయింది. మళ్ళి ఏమి అనుకున్నదో వాపసు ఇచ్చింది. తండ్రి చని పోయినప్పుడు ఉరికి పోతె నేను "క్యాంప్‌కు" రావద్దని ఇంట్ల పెట్టి తాళ్ళంఏసింంరు. పక్కొల్లతో తాళ్ళం పగలగొట్టించి వచ్చిన. నేను చదువుకుంటా ఇక్కడ మంచిగ అనిపిస్తున్నది.

> పేద తల్లితండ్రులు వాళ్ల పిల్లలకు చదువు కావాలని కొరుతున్నారు. దీన్ని గుర్తించకుండా కొందరు పేదవాళ్ళు పిల్లల చదువును పట్టించుకోరని, పనికి పంపి తెచ్చె కూలి డబ్బులు కుటుంబ ఆదాయానికి తోడవుతుందనె భావం ఉన్నదనె వాదనను సమాజంలో ముందుకు తెస్తున్నారు. ఇది పొరపాటు. పేద తల్లితండ్రులు వాళ్ల పిల్లలకు చదువు కావాలని డిమాండ్ చేస్తున్నారు. దాన్ని గుర్తించకపోవడం అంటే పిల్లల అభివృద్ధిని ఆటంకపర్చడమే. ఎక్కడైతె పేద తల్లితండ్రులను కలిసి మీ పిల్లలను చదువుకు పంపండి అని అడిగి బడిని ఏర్పాటు చేస్తే ఖచ్చితంగా పంపుతున్నారు. మహబూబ్‌నగర్‌లోని చెంచులు, ఆదిలాబాద్‌లోని గొండు, కొలామ్‌లు, తాండూర్ క్వారీ కార్మికులు, శ్రీకాకుళం మత్స్య కార్మికులు, నిజామాబాద్ బీడి కార్మికులు ఎవ్వరైనా పంపుతున్నారు. ఇది మా అనుభవం.
>
> శ్రీమతి శాంతా సిన్హా

**పేరు : రాములమ్మ** **ఊరు : దన్నారం** **వయస్సు : 13 సం॥రాలు**

ఉర్లఉండె కల్వనికి, పత్తి పీకనీకి పోతుంటి. నేను చదువుకోనికి పోతానంటే మా ఆయ్యా "నాకు చేతి మీద నీళ్ళు పోసేటోల్లు ఎవ్వరు లేరు". పోవద్దు. నేను రోజు కూలి చేసి మా ఆయ్యాకు బీడిలకు పెసలు ఇస్తుంటి, ఇళ్ళగడుపుతుంటి. ఎంత చాకిరీ చేసినీ ఎముందని చదువుకునాలని ఇక్కడకు వచ్చిన. మా వాళ్ళు ఇట్ల నీవు ఇక్కడ వుంటె ఉర్ల చెడుగా అనుకుంటారు. మా ఆయ్యా అయితే నీవు నాకుపుట్టినదైతె ఇక్కడకు ఎందుకు వస్తవు అని అన్నడు. అయినా నేను ఇక్కడే ఉండి చదువుకొవాలని ఉండిపోతునా



**పేరు : అనుసుజ** **ఊరు : మల్లారెడ్డి గూడం** **వయస్సు 14 సం॥రాలు**

మా అమ్మ ఉరిపెట్టుకుని చనిపోయింది. "కాపోల్ల" (ధనికరైతు) కు కసువు ఉకానికి పోతుంటి. ఆరు లీటర్లపాలు పోసి వస్తుంటి-కూలీకి పోతుంటి బర్లగడ్డి తెస్తుంటి. నాకు పెళ్ళి చేసింంరు అత్తమామల తిట్లెటోల్లు. ఎంత చాకిరిచేసినా తిట్టుడు, తిండిపెట్టక పోయెటోల్లు ఇక బ్రతుకడెందుకని మందు తాగినా చనిపోదామని దవకానాల ఎసి మంచిగ అయినక ఇక్కడకు వచ్చినా ఎప్పుడు అవె గుర్తుకు వస్తయి. ఇప్పుడు చదువుకుంటాన్న.



**పేరు : హేమలత** **ఊరు : సోమన్నగుర్తి** **వయస్సు 15 సం॥రాలు**

చిన్నప్పటి నుండి పనులు చేస్తుంటి. వద్దన్నంగ పెళ్ళి చెసింంరు. మా అమ్మలేకపోయే, వాడు గట్టిగలేడు. వాళ్ళమీత మనస్సు తెంచుకున్న. చదువుకొవలని నా మనస్సు గట్టిగ చేసుకున్న. అత్తగారింట్ల బండ చాకిరి చేసినా నా మొగుడు లేకపోదె ఇద్దరి పని చెసినా, పోలంకి నా భర్త వంతుకు నాతో పురుగు మందు గొట్టించింంరు, బస్తాలు మొయించిరు. నాకు తిండి పెట్టలేదు ఆకలి, దప్పికతో ఉన్న. ఇక పురుగుల మందు దప్పిక ఆరెదాక తాగిన సస్తానికి. నన్ను దావాఖనాల వేసి మంచిగ చేసింంరు. మా ఉర్ల ఒడ్డెరామె చింపిరిజుట్టు, చిరిగిన బట్టలతో ఉంటుండె. ఒక రోజు ఉర్ల మంచి బట్టలు తొడిగి, ఎంటికలు దువ్వుకొని, చెప్పులు ఏసుకుని పోతుంటే పిల్చి అడిగిన అప్పుడు క్యాంప్‌ల ఉంటున్న అన్నది. నేను ఇంత పెద్దగ ఉన్న నన్ను తీసుకుంటార అని అడిగిన ఏ ఫీల్ కాకు తీసుకుంటారు అన్నది. ఇక వచ్చి క్యాంప్‌ల చేరిన చదువు నేర్చుకుంటున్న.

**గమనిక:** బాల కార్మిక వ్యవస్థపై ఇచ్చిన ఈ ప్రత్యేక సంచిక (పేజి 2 నుండి 9 వరకు)లోని వ్యాసాలు, ఇంటర్వ్యూలలో వెలిబుచ్చిన అభిప్రాయాలు రచయితల అభిప్రాయాలు మాత్రమే. అంతర్జాతీయ కార్మిక సంస్థ (ఐఎల్‌ఒ), బాల కార్మిక వ్యవస్థ నిర్మూలనపై అంతర్జాతీయ కార్యక్రమం (ఐపిఇసి) ధృవీకరించిన అభిప్రాయాలు మాత్రం కాదు.

# జూట్ కార్మికుల అపూర్వ విజయం

సి.హెచ నరసింగరావు
సి.ఐ.టి.యు,
రాష్ట్ర కార్యదర్శి

విశాఖ జిల్లాలోని చిట్టివలస జూట్ కార్మికుల వేతన ఒప్పందంపై డిసెంబర్ 21వ తేదిన డి.సి.ఎల్. సమక్షంలో సంతకాలు జరిగాయి.

ఒప్పందం వివరాలు :

ఎ) బేసిక్ జీతం నెలకు నేడున్న రూ. 297.50 నుంచి 342.50కు పెరుగుతుంది. గతంలోవలె నెలకు 208 పని గంటలు పని చేయాలి

బి) కరువు భత్యం(1982 సిరీస్) ప్రకారం పెరిగే ప్రతి పాయింట్‌కు రూ. 7.43 నుంచి రు. 7.67కు (0.24 పైసలు) అదనంగా పెరుగుతుంది.

సి) పర్మినెంట్ కార్మికుల కాంప్లిమెంట్ 2808 గాను, స్పెషల్ బదిలీ 624 గాను యాజమాన్యం అంగీకరించింది. ఇంతకంటే తక్కువగా వుండే ఖాళీలను ప్రతి సంవత్సరం సెప్టెంబర్ మరియు ఫిబ్రవరి ఆఖరులో సమీక్షించబడుతుంది. ఈ సంవత్సరం వెంటనే నెలరోజులులోగా ఖాళీలను నింపుతారు తద్వారా సుమారుగా 700 మంది పర్మినెంట్‌గాను, స్పెషల్ బదిలీలుగా అవుతారు.

డి) 180రోజులు వాస్తవ ట్రయినింగ్‌పూర్తి చేసిన ట్రైయినీలను బదిలీలుగా నెలరోజులలోగా పరీక్షలు నిర్వహించి తీసుకోవడానికి యాజమాన్యం అంగీకరించింది. గతంవలే పరీక్షలు జరిగేటప్పుడు ఎటువంటి అవినీతి, అక్రమాలు జరిగినా యూనియన్లు సహించవని తెలియజేశాయి.

ఇ) ఈ ఒప్పందం 20-12-01 నుంచి మూడు సంవత్సరాల పాటు అమలులో వుంటుంది.

★ ★ ★ ★

పై అంశాలు సాధారణం ఇతరులు పరిశ్రమతో పోల్చినా గొప్పవేమీకాదు. ఒప్పందం ఈనాడు సాధించడానికి ప్రధాన కారణం "కార్మికవర్గం ఐక్యత"గా సి.ఐ.టి.యు (గుర్తింపు), ఎ.ఐ.టి.యుసి., టి.యన్.టి.యు.సి. నాయకులు ప్రశంసించారు.

**ఒప్పందంలో ప్రత్యేకతలు**

బి) గతంలో జూట్ పరిశ్రమలో 180 రోజులు ట్రైయినింగ్ పూర్తయిన వారిని బదిలీగా మార్చేవారు. కాని రెండు సంవత్సరాల క్రితం హుగ్లీ గ్రూపు యాజమాన్యం అరుణా, ఈస్టుకోస్టు జూట్ మిల్లులోని కార్మికుల గుర్తింపు యూనియన్ ఐ.యఫ్.టి.యు. ఈ కాలాన్ని 4 1/2 సంవత్సరాలుగా మార్చింది. ఇదే యాజమాన్యంలోని బొబ్బిలి శ్రీ కృష్ణా జూట్‌లోని సి.ఐ.టి.యు గుర్తింపు యూనియన్ దీనిని అంగీకరించకుండా 2 మాసాలు నిరవధిక సమ్మె చేసినా యాజమాన్యం మొండిగా వ్యవహరించింది. ఈపద్ధతిని వెనక్కునెట్టి పాత పద్ధతిని నిలబెట్టిన ఘనత చిట్టివలస



కార్మికులకు దక్కింది.

బి) 1996 తర్వాత జూట్ పరిశ్రమలో ఎక్కడా జీతాల పెంపు జరగలేదు. 1996లో చిట్టివలసలో అనాటి గుర్తింపు యూనియన్ ఎ.ఐ.టి.యుసి. పనిభారం పెంచుతూ ఒప్పందం చేసింది. పనిభారం అమలు చేస్తేనే దానితోముడిపడివున్న బేసిక్ నెలకు రూ. 45/- మరియు డి.ఎ. 0.24 పై అదనంగా చెల్లిస్తామని మొండికేసింది.

సి.ఐ.టి.యు నాయకత్వంలోనికి వచ్చి పదిరోజుల నిరవధిక సమ్మె అనంతరం యాజమాన్యం బేసిక్, డి.ఎ. ఎటువంటి ఉత్పత్తి ముండిలేకుండా పెంచడానకి అంగీకరించింది. పనిభారం పెరగకుండా జీతం పెరగడం వలే ఈ ఒప్పందం అపూర్వమైన ఓప్పందంగా కార్మికులు కొనియాడారు.

సి) ప్రజాతంత్ర పద్ధతిన మొదటిసారిగా జనరల్‌బాడీలో అమోదం తర్వాతే వేతన ఒప్పందంపై సంతకాలు జరిగాయి. సంతకాలు పెట్టి వచ్చి జనరల్ బాడీలో చప్పట్లు కొట్టించేవారు. 1992లో గంగాధరరెడ్డి చేసిన అలాంటి ఒప్పందానికి వ్యతిరేకంగా కార్మికులు 5 మాసాలు సమ్మె చేశారు. ఒప్పందం రద్దయ్యింది. కాని గతంలో ఎన్నడూలేని విధంగా అన్ని యూనియన్ల కార్మికులు కూడా ఏకగ్రీవంగా ఇవ్వటి ఒప్పందాన్ని ఆమోదించారు. ప్రజాతంత్ర పని విధానం ప్రధాన్యత ఇతరులు గుర్తించకపోయినా సి.ఐ.టి.యు విస్మరించదని ఈ ఒప్పందం చాటి చెప్పింది.

డి) జూట్ మిల్లులోని ట్రేడ్ యూనియన్ల మధ్య ఐక్యతా సాధనే ఈ విజయ రహస్యం. జూట్ కార్మికులు స్వతహాగానే సమరశీలంగా (మిలిడెంట్) వుంటారు. ఈసారి సి.ఐ.టి.యు గుర్తింపు యూనియన్‌గా వున్నా ఇతర యూనియన్‌లనుటి.యన్.టి.యు.సి., ఎ.ఐ.టి.యు.సి. కాంగ్రెస్ సంఘంకుడా చర్చలకు ఆహ్వానించడం ముందుగా వారిని ఆశ్చర్యపరచింది.

మూడు యూనియన్లు కలిసి నిరవధిక సమ్మెకు పిలపునిచ్చాయి. అయినా కాంగ్రెసు కార్మిక సంఘం చర్చలలో పాల్గొనలేదు. సమ్మె వాతావరణం వచ్చింది. కార్మికుల ఒత్తిడి మేరకు వారి కార్మికులు,నాయకులు కూడా పూర్తిగా సమ్మెలో పాల్గొన్నారు. గంగాధరరెడ్డి కాదన్నా ఆ సంఘం కార్మికులు ఐక్య ఉద్యమాలకే మొగ్గుచూపారు. వారి యూనియన్‌లోని సభ్యులు, నాయకులతో సహా సహాకరించారు. ఐక్యఉద్యమానికి సి.ఐ.టి.యు. తీసుకొన్న చొరవ, అన్ని యూనియన్లు, యావత్తు కార్మికులు స్పందించిన తీరువల్లే ఈ విజయం సాధ్యమైంది.

అదనులో సమ్మె చేయడం కూడా పోరాటం జయపద్రం కావడానికి ఒక ముఖ్య కారణం. పశ్చిమబెంగాల్‌లో సమ్మెలు జయపద్రం కావడానికి మూలకారణం సరైన సీజన్‌లో సమ్మె చేయడం. ఐక్యంగా చేయడం అని కార్మికులకు నచ్చ చెప్పి కార్మికులను సమ్మెకు సిద్ధం చేసింది. గంగాధర రెడ్డి యూనియన్, మరికొందరు పని గట్టుకొని సమ్మె చేస్తే పండుగకు యిబ్బందిపడాలని, లీవులుపోతాయని చేసిన ప్రచారం పటాపంచలయింది.

**ఐక్యతా పోరాటం**
**సమ్మె విజయానికి మూలం.**

## ఆంధ్రాబ్యాంక్ ఎంప్లాయీస్ ఫెడరేషన్ 4వ మహాసభ



ఆంధ్రాబ్యాంక్ ఎంప్లాయీస్ ఫెడరేషన్ 4వ అఖిల భారత మహాసభ 23.12.2001న గుంటూరులో దిగ్విజయంగా ముగిసింది. సిఐటియు కార్యదర్శి కా॥ సుధాభాస్కర్ మహాసభ ప్రారంభోపన్యాసం చేశారు. మహాసభకు ముఖ్యలతిధిగా హాజరయిన ఆలిండియా రిజర్వు బ్యాంకు ఎంప్లాయీస్ అసోసియేషన్ ప్రధాన కార్యదర్శి కా॥ సమీర్‌ఘోష్ ప్రధాన వుపన్యాసం చేశారు. మహాసభలో బెఫి ఆంధ్రప్రదేశ్ ప్రధాన కార్యదర్శి కా॥ యం.వి. మాధవరావు, ఆంధ్రప్రదేశ్ గ్రామీణ బ్యాంక్ ఉద్యోగుల అసోసియేషన్ ప్రధాన కార్యదర్శి కా॥ వెంకటేశ్వర రెడ్డి ప్రసంగించారు.

# కోల్ సమ్మె - ఒక పరిశీలన

**యం.సాయిబాబు**
ప్రధానకార్యదర్శి
సింగరేణి కాలరీస్ ఎంప్లాయీస్ యూనియన్

బొగ్గు పరిశ్రమలోని జాతీయ కోల్ ఫెడరేషన్లు ఇచ్చిన పిలుపు మేరకు 2001 డిసెంబర్ 3, 4, 5 తేదీలలో సమ్మెలో పాల్గొన్న కార్మికులకు అభినందనలు.

సింగరేణి యాజమాన్యం సమ్మె డిమాండ్లు సింగరేణికి వర్తించవంటూ అబద్దపు ప్రచారం చేసినా, గుర్తింపు యూనియన్ (AITUC) నాయకులు సమ్మెను విచ్ఛిన్నం చేసేందుకు పడరాని పాట్లు పడినా, INTUC నాయకులు సమ్మెకు దూరంగా ఉండమని ప్రాధేయపడినా కార్మికులు ఏ మాత్రం ఖాతరు చేయలేదు. యూనియన్ అనుబంధాలతో నిమిత్తం లేకుండా సింగరేణి వ్యాపితంగా 80,000 మంది కార్మికులు సమ్మెలో పాల్గొనటం విశేషం. బొగ్గు పరిశ్రమను రక్షించుకోవాలని, 7వ వేతన కమిటీ ని ఏర్పాటు చేయాలని, 6వ వేతన ఎరియర్స్ మొత్తం చెల్లించాలని, రిటైరైన కార్మికుల పెన్షన్ వెంటనే ఇవ్వాలని, క్రొత్త గనులు ప్రారంభించి కార్మికుల డిపెండెంట్లుందరికి వెంటనే ఉద్యోగాలు ఇవ్వాలని జరిగిన 3 రోజుల సమ్మెను విజయవంతం చేయటం ప్రభుత్వాలకు-సమ్మె విచ్ఛిన్నకులకు చెంపపెట్టులాంటిది: కార్మికుల డిమాండ్లను పరిష్కరించేందుకు సిద్దపడకపోతే బొగ్గు పరిశ్రమలో మరో పెద్ద పోరాటం తప్పదు. పరిశ్రమను ఉద్యోగభద్రతను కాపాడుకునేందుకు గాను ఎలాంటి త్యాగాలకైనా గని కార్మికులు సంసిద్ధంగా ఉన్నారనే దానికి ఈ 3 రోజుల సమ్మె నిదర్శనం.

**AITUC-INTUC నాయకుల యాజమాన్ల అనుకూలాలవైఖరి**

సమ్మె డిమాండ్లు సింగరేణికి వర్తించవంటూ యాజమాన్యం చేసిన తప్పుడు వాదనలకు AITUC-INTUC నాయకులు వంత పాడారు. దేశవ్యాపిత సమ్మె పిలుపులో AITUC భాగస్వామి. కాని సింగరేణిలోని దాని అనుబంధ సంఘం వర్కర్స్ యూనియన్ సమ్మెను వ్యతిరేకించింది.

ఇది అనవసరపు సమ్మె అని, కార్మికులు జీతాలు నష్టపోతారంటూ యాజమాన్యం కంటే కూడా తెగబాధపడిపోవటం కార్మికులను ఆశ్చర్యానికి గురి చేసింది. సమ్మెలో పాల్గొనమని విజ్ఞప్తి చేసేందుకు గనుల వద్దకు వెళ్ళిన నాయకులను మీటింగ్‌లు పెట్టటానికి వీలు లేదంటూ అడ్డు తగిలి యాజమాన్యానికి AITUC కొమ్ముకాచింది. బలవంతంగా కార్మికులను డ్యూటీలోకి దించేందుకు యాజమాన్యం-పోలీసులు AITUC నాయకులు తీవ్రంగా ప్రయత్నించినా, సమ్మె చేయటంతో AITUC నాయకులు అసహనానికి గురైనారు. ఒక నాయకుడు "కోల్ ఇండియా ఛోడ్‌దో-సింగరేణి బచావో" అని నినాదాన్నిస్తే, మరోక నాయకుడు "జాతీయ కార్మిక సంఘాలు" నశించాలంటూ అరవటాన్ని ప్రత్యక్షంగా చూసిన కార్మికులు ముక్కున వేలేసుకున్నారు.

రాష్ట్ర ముఖ్యమంత్రి సింగరేణి యాజమాన్యం, AITUC-INTUC నాయకుల నోట ఒకే రకమైన మాటలు వస్తున్నాయి. ఈ అసంబద్ధపు, మోసపూరిత వాదనల ద్వారా ఎవరి ప్రయోజనాలు కాపాడదల్చుకున్నారో ఆ నాయకులే కార్మికులకు సమాధానం చెప్పవల్సి యున్నది.

**మన దేశ బొగ్గు పరిశ్రమ రక్షణతోనే సింగరేణి భవిష్యత్ ముడిపడి వుంది.**

1973 బొగ్గు గనుల జాతీయకరణ చట్టాన్ని సవరణచేసి, గనులను ప్రైవేటీకరణ చేయాలని కేంద్రప్రభుత్వం పావులు కదుపుతుంటే, ప్రపంచబ్యాంకుతో జరిగిన ఒప్పందం మేరకు సింగరేణిలోని 7 బొగ్గు బ్లాకులను ప్రైవేటు సంస్థలకు అప్పజేప్పాలని చంద్రబాబు క్యాబినెట్ నిర్ణయించింది. 6వ వేతన ఒప్పందం కాలం ముగిసి, 7వ వేతన ఒప్పందం సమయం వచ్చినా, ఇంకా 40 శాతం ఎరియర్స్ ఇవ్వాల్సే వుంది. 31.3.1994 తర్వాత రిటైరైన కార్మికులకు పెన్షన్ అర్హత వున్నా ఇవ్వటం లేదు. కీలకమైన ఈ డిమాండ్లన్నీ సింగరేణి కార్మికుల డిమాండ్లు కాదని చెప్పటం అవివేకం తప్ప మరొకటికాదు. రాబోయే ప్రమాదాలను గుర్తించి చైతన్యయుతంగా కార్మికులు సమ్మెను జయప్రదం చేసిన తీరు అటు యాజమాన్యానికి, ఇటు సమ్మె విచ్ఛిన్నకులకు మింగుడు పడటం లేదు.

**వైఖరి మారకుంటే మరో పోరాటం తప్పదు.**

బ్యాంకు విధానాలను "సంస్కరణల" పేరుతో అమలు జరుపుతూ తీవ్రమైన పని భారం పెంచుతున్నది. పెద్ద సంఖ్యలో కార్మికులను కుదించేందుకు "గోల్డెన్ హ్యాండ్ షేక్"ను అన్ని క్యాటగిరీలకు విస్తరింపజేసింది. సాంప్రదాయంగా ఉన్న పని పద్ధతులను మార్చి వేస్తూ కార్మికులను మానసిక ఒత్తిడికి గురి చేస్తున్నది. రక్షణ విషయంలో అశ్రద్ధ చేస్తున్న ఫలితంగా తరచూ గని ప్రమాదాలు జరిగి కార్మికులు బలైపోతున్నారు. కార్మికులకు సప్లై చేసే మంచినీళ్ళు, విద్యుత్ పై క్రొత్తభారాలు వేస్తున్నది. క్యాంటిన్ రేట్లు 300 శాతం పెంచింది. ప్రైవేటు గ్యాస్ బిల్లులకు రీఅంబర్స్‌మెంట్‌ను ఆపుచేసింది. గులాయిలలో సరిపడా గాలి, నీరు లేకపోయినా ప్రతి ఫిల్లర్ 2 టబ్బులు నింపాలని బెదిరిస్తున్నది. బొగ్గు నింపే టబ్బు సైజును పెంచేందుకు, వారానికి 7 రోజుల పనిదినం పెట్టేందుకు యాజమాన్యం పథకం వేస్తున్నది. గత 6 నెలలుగా VRS కార్మికుల డిపెండెంట్లు ఉద్యోగాల కోసం నిరాహార దీక్షలు చేస్తున్నా యాజమాన్యం మొండివైఖరి అవలంభిస్తున్నది. బావుల వద్ద జీతాలు ఇచ్చే పద్దతిని, నిర్బంధంగా బ్యాంకులకు మారుస్తున్నది.

ఈ విధానాల ఫలితంగా కార్మికుల్లో తీవ్ర అసంతృప్తి పేరుకొని ఉన్నది. కార్మికుల మనోభావాల కనుగుణంగా అన్ని యూనియన్లు విశాల ఐక్య పోరాటానికి నడుం బిగించాల్సిన ఆవశ్యకత ప్రస్తుత పరిస్థితిలో ఎంతైనా ఉన్నది.



# SETWIN

Society for employment Promotion & Training in twin Cities

(A Govt of A.P. Society)

No.4, Azmath Jah Palace, Purani Haweli, Hyd.

## A. COMPUTER COURSES

| S.No | NAME OF THE COURSE | DURATION IN MONTHS | QUALIFICATION |
|---|---|---|---|
| 1. | COMPUTER SOFTWARE (CAP) | 3 | SSC |
| 2. | C,C++ | 2 | DEGREE |
| 3. | UNIX & C, C++ | 3 | DEGREE |
| 4. | ORACLE 8.0 WITH D2K | 3 | DEGREE (COMP) |
| 5. | VISUAL BASIC | 3 | DEGREE (COMP) |
| 6. | MS-OFFICE | 3 | INTER |
| 7. | P.G.D.C.P. | 12 | DEGREE STUDENTS |
| 8. | D.I.P.D.E. | 6 | INTER |
| 9. | ACOUNTANCY | 1 1/2 | INTER |
| 10. | ORACLE 8i DBA | 2 | DEGREE (COMP) |
| 11. | D.T.P. | 1 1/2 | SSC |
| 12. | DCHT (HARDWARE) | 6 | DEGREE/DIP/ITI IN ELECTRONICS |
| 13. | CCM (HARDWARE) | 3 | SSC |
| 14. | MULTIMEDIA | 3 | SSC |
| 15. | WEB DESIGNING | 4 | INTER |
| 16. | AUTO CAD-2K | | |
| 17. | COMPUTER AIRLINE TICKETING | 3 | SSC PASS |
| B. | **MANAGEMENT COURSES** | | |
| 18. | P.G.D. Business Management | 10 | Degree |
| 19. | PGD Export & Import Management | 12 | Degree |
| 20. | Diploma in Taxation | 4 | Degree |
| **C. Other courses** | | | |
| 21. | Fashion Designing (Comp) | 6 | SSC |
| 22. | Advanced Fasion Designing | 6 | SSC |

| S.No | NAME OF THE COURSE | DURATION IN MONTHS | QUALIFICATION |
|---|---|---|---|
| 23. | CUTTING & TAILORING | 6 | 7 TH |
| 24. | ZIG ZAG | 3 | 7 TH |
| 25. | BEAUTICIAN | 3 | SSC/FL |
| 26. | ADV. BEAUTICIAN | 3 | SSC |
| 27. | BANJARA MIRROR WORK KUTCH WORK | 6 | 7 TH |
| 28. | SOFT TOYS & FABRIC PAINTING | 3 | SSC/FL |
| 29. | R. & TV (B/W) | 6 | SSC |
| 30. | R & TV COLOR TV | 9 | SSC |
| 31. | LIGHT MOTOR DRIVING | 1 1/2 | 7 TH |
| 32 | ELECTRICIAN | 6 | 7 TH |
| 33 | AUTO-ELECTRICIAN | 6 | 7 TH |
| 34. | DIESEL MECHANIC | 6 | 7TH |
| 35. | R & A/C | 6 | SSC |
| 36. | GEM CRAFT | 6. | 7 TH |
| 37. | TELEPHONE OPERATOR | 1 1/2 | SSC |
| 38. | WELDING | 6 | 7 TH |
| 39. | PLUMBING | 6 | 7 TH |
| 40. | HOTEL MANAGEMENT | 6 | INTER |
| 41. | TYPE WRITING (H/L) | 6 | SSC |
| 42. | SHORTHAND | 6 | SSC |
| 43. | PG DIPLOMA IN HOTEL MANAGEMENT | 6 | 7 TH |
| 44. | TOURIST GUIDE | 3 | DEGREE |
| 45. | SAREE ROLLING | 1 1/2 | 7 TH |
| 46 | SPOKEN ENGLISH | 13 | SSC |
| 47. | PRE PRIMARY TEACHER TRAINING COURSE | 6 | SSC |
| 48. | DIP. INSCHOOL MANAGEMENT | 6. | SSC |
| 49. | SCREEN PRINTING | 1 | 7 TH |
| 50. | PHOTO LAMINATION | 15 D | 7 TH |
| 51 | PHOTO SHOP | 45 D | |

## A. SETWIN TRANING CENTRE

| S.No. | Training Centre | Address & Phone | Courses Available |
|---|---|---|---|
| 1. | ** MOTHIGALLY | CHARMINAR, 4523540 | 1,4,6,11,13,17,21 to 25,28, to 37, 40, 41,44 |
| 2. | ** MUSHEERABAD | RTC 'X' ROADS, 7662709 | 1,3,6,7,11,13,17,21, to 25,29, 30, 32, 35, 40,41,43 |
| 3. | ** SHANTINAGAR | OPP. HOCKEY GROUND ST. ANNS SCHOOL RD., MASAB TANK, 4520196 | 3 to 8, 11, 13, 21, 25, 40 |
| 4. | ** TARNAKA | TARNAKA, 7014258 | 2, 3, 6-16,18,19,20 |
| 5. | MEHDIPATNAM | MEHDIPATANAM 3538180 | 1,9,11,13,25,40 |
| 6. | RIYASATHNAGAR | COMMUNITY HALL 4340416 | 4,6,7,8,13,21,23,24, 25,32,41 |
| 7. | SIMCO VIDYANAGAR | VIDYANAGAR, 7618421 | 2,4,6,7,11,21,25,26,40 |
| 8. | E-MAREDPALLY | NEAR : SHENOI NURSING HOME, 4520196/4524539 | 3,4,6,7,11,21,25,26,40 |
| 9. | * NALLAKUNTA | NEW NALLAKUNTA 7424663 | 1,3,4,6,7,11,21,23,24,25 27,28,31,41,42 |
| 10. | *YOUSUFGUDA | COMMUNITY HALL | 21,23,24,25,27,28,45 |
| 11. | EDI BAZAR | QQSUDA AKBAR | 21,23,24,25,33,41 |
| 12. | *EXHIBITION GR. | NAMPALLY, 4603172 | 1,3,4,6,7,8,11,21,23,25,40 |
| 13. | CHITANYA PURI | 37-77-1, Defence Colony, Neredmet X Road, Sec-bad. Phone: 7113621 DBR Complex, IIIrd Floor, Chaitanyapuri X Road, DSNR | 1,6,11,21,72,23,25,26,28 |
| 14. | MIR ALAM TANK | MEHDIPATAN 3538180 | 21,23,24,25,31,33,34,38 |
| 15. | SAIDABAD | SAIDABAD. PH :4520196 | 23,24 |

* APSRTC BUS PASS FACILITY AVAILABLE * PLACEMENT ASSISTANCE WILLBE PROVIDED * EXCLUSIVELY FOR LADIES

VISIT US : www.setvinapgov.com

Sd/-

G. Janardhanr Reddy, MSc.

Managing Director, SETWIN



# వృత్తిరుగ్మతలు - డాక్టరు సలహాలు



**డాక్టర్ రాఘురామయ్య, హైదరాబాద్**

వై. సింహచలం - హైదరాబాద్ , వయసు : 51 సంిిరాలు

**సమస్య : అప్పుడప్పుడు డల్‌గా వుంటుంది. ఎక్కువ సేపు సీట్లో కూర్చొని పని చేసుకుంటాను. క్లరికల్‌వర్కు, విరోచనంచేసేటప్పుడు బ్లడ్ పడుతుంది. ఈ వ్యాధి నుంచి నివారణ మార్గం చెప్పండి.**

సలహా : దయాబిటీస్ టెస్ట్ మరియు **B.P** టెస్ట్ చేయించుకొవాలి. మీకు డిప్రెషన్ ఉన్నా, టెన్షన్‌తో ఉన్నా డల్‌గా ఉంటుంది. కావున మీ **History** పూర్తిగా తెలియపరిస్తే పరిష్కారం చెప్పగలను.

విరేచనం అయ్యేటప్పుడు బ్లడ్ పడితే **PILES** వచ్చే అవకాశం ఉంది. మీరు వెంటనే పరీక్ష చేయించుకొండి.రిపోర్టు పరిశీలించాక నివారణ చెప్పగలను.

శ్రీపతిరావు షాద్‌నగర్ , వయసు : 48 సంిిరాలు

**సమస్య : నూలుమిల్లులో పని చేస్తుంటాను -Textile Industry. నాకు ఈ మధ్య తరచుగా దగ్గు వస్తోంది - క్షయవ్యాధేమోనని అనుమానంగా వుంది.**

సలహా : **CHEST X-RAY** చేసుకోవాలి. బ్లడ్ టెస్ట్ చేయించుకోవాలి. రిపోర్టులు చూశాక నివారణ చర్యలు సూచించగలను.

బి. పోషయ్య, గోదావరిఖని,వయసు : 45 సంిిరాలు

**సమస్య : నేను బొగ్గుగనుల్లో పనిచేస్తువుంటాను. నాకు తరచు ముక్కుదిబ్బర వేస్తోంది. కొద్ది సేపు పనిచేస్తే చాలా ఆయాసంగా వుంటుంది. నిత్యం నీరసంగా బాధపడుతున్నాను. క్షయవ్యాధేమోనని మందులిచ్చారు -అయినా తగ్గలేదు - అదేదో 'న్యూమోకొనియోసిస్' అని క్రొత్తపేరు చెప్తున్నారు - దీని నుండి నాకు విముక్తి ఎలా ?**

సలహా : "న్యూమో కొనియోసిస్" అనేది చాలా తీవ్రమైన, ప్రమాదకరమైన వ్యాధి. ప్రాథమిక దశలో ఉంటే ప్రివెంటివ్ మెడిసిన్స్ వాడి జబ్బు తీవ్రతను తగ్గించవచ్చు. సీరియస్‌గా ఉంటే మీరు ఉద్యోగం కూడా మానుకోవాల్సి ఉంటుంది.

"న్యూమోకోనియోసిస్" వల్ల లంగ్స్ ఫంక్షనింగ్ దెబ్బతింటుంది. తరచు ఆయాసం, దగ్గు వస్తుంది. కావున మీరు **PULMONOLOGIST** (లంగ్స్ స్పెషలిస్టు)ను వెంటనే సంప్రదించండి. వారు సూచించిన పరీక్షలు చెయించంగి. రిపోర్టులు బట్టి నివారణ చర్యలు తెలుపగలను.

కొలనూరు వెంకటలక్ష్మి (గృహిణి), హైదరాబాద్

**సమస్య : ఒళ్ళంతా దురదలుగా వుంటుంది. గోకితే పొక్కులువస్తున్నాయి. గోకితే పుండ్లు పడతాయి. తర్వాత మందులు వాడితే పోతాయి. కాని దురదలో పోవడం లేదు. నాది పోడిచర్మం.**

సలహా : దయబిటీస్ వల్ల లేదా అలర్జీ వల్ల రావొచ్చు అదే విధంగా మీ కుటుంబ సభ్యుల్లో ఎవరికైనా ఉంటే మీకు రావచ్చు.

**'ATARAX' Tablets** రోజుకు రెండు చొప్పున వారంరోజులు, **'BECADEXAMINE'** క్యాప్సుల్స్ రోజుకు ఒక్కటి చొప్పున నెలరోజులు వాడితే నయం అవుతుంది.



ఒంగోలులో జగిరిన విశాఖ రీజియన్ జనరల్ ఇన్సూరెన్స్ అసోసియేషన్ 6వ మహాసభల దృశ్యం



హైదరాబాద్‌లో జరిగిన ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఎంప్లాయీస్ యూనియన్ హైదరాబాద్ డివిజన్ మహాసభలో ప్రసంగిస్తున్న సిఐటియు రాష్ట్ర ప్రధాన కార్యదర్శి ఎస్. వీరయ్య




ప్రకాశం జిల్లా కందుకూరులో ప్రైవేటీకరణ వ్యతిరేక సదస్సులో ప్రసంగిస్తున్న సిఐటియు రాష్ట్ర ఉపాధ్యక్షులు బి.వి. రాఘవులు

## కార్మికలోకం పాఠకులకు గమనిక

ఈ నెల నుండి 'ఆరోగ్యం' శీర్షిక రెగ్యులర్‌గా ప్రచురించబడుతుంది. ప్రతినెల 10 వ తేదీలోగా చేరేలా వృత్తిరుగ్మల వల్ల మీరు ఎదుర్కొంటున్న అనారోగ్య సమస్య గురించి 'ఎడిటర్ -కార్మికలోకం' కు పోస్టుకార్డు పై వివరాలు వ్రాయాలి. అందులో వయసు, వృత్తి, అడ్రసు, వ్యాధి ఎంతకాలంగా వుంది వగైరా వివరాలు తప్పక వ్రాయలి. ఆయా విభాగాలకి సంబంధించిన ప్రముఖ వైద్యులచే తరువాత నెల కార్మికలోకంలో ఇవ్వబడతాయి. ఈ శీర్షికను వినియోగించుకొని వైద్య సలహాలు పొంద వలసిందిగా కోరుతున్నాము.

-ఎడిటర్.

# ఆత్మరక్షణ నుండి సమరశీలతకు ఎదగాలి

(డిసెంబరు 19 నుండి హైదరాబాద్‌లో ప్రారంభమైన ఎ.ఐ.టి.యు.సి. అఖిల భారత 37వ మహాసభలలో సి.ఐ.టి.యు. అఖిల భారత ప్రధాన కార్యదర్శి డాక్టర్ యం.కె. పాంధే ప్రసంగం సారాంశం)




కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు పెద్ద ఎత్తున చేస్తున్న దాడిని తిప్పికొట్టాలంటే ప్రస్తుతం నిర్వహిస్తున్న రక్షణాత్మక పోరాటాలను సమరశీల పోరాటాలుగా మలచాలని సిఐటియు అఖిల భారత ప్రధాన కార్యదర్శి. ఎం.కె. పాంధే పేర్కొన్నారు.

మహాసభలు విజయవంతం కావాలని ఆయన సౌహార్ద సందేశమిస్తూ ఐక్య ఉద్యమాలను నిర్మించడంలో తమ రెండు సంఘాల మధ్య సహకారం రోజురోజుకూ పటిష్టమౌతున్నదన్నారు. అన్ని కేంద్ర కార్మిక సంఘాలు ఐక్యంగా పోరాడితేనే ప్రభుత్వ విధానాలను తిప్పికొట్టగలమన్నారు. ఐక్యత లేకుంటే పోరాటాలు లేవని పేర్కొన్నారు. కార్మిక వర్గంపై జరుగుతున్న భయంకర దాడిని తిప్పికొట్టేందుకు కార్మిక సంఘాలన్నీ కలిసి ఒకే సంఘటితంగా పోరాడాల్సిన అవసరం ఉందన్నారు. దీనిపై చర్చ జరగాలన్నారు. ఉగ్రవాదన్ని పోటో అణచలేదని, అందుకు కారణమైన సామాజిక అంశాలను పరిష్కరించాలన్నారు. చట్టాలతో సామాజిక సమస్యలను పరిష్కరించలేరని, దేశ ప్రజలంతా కలిసి ఉగ్రవాదన్ని నిర్మూలించాలి కానీ, ఎన్డీయే ప్రభుత్వం కాదని పాంధే పేర్కొన్నారు. ప్రపంచ కార్మిక సంఘాల సమాఖ్య (డబ్ల్యు.యఫ్.టి.యు) ప్రధాన కార్యదర్శి అలెగ్జాండర్ ఝురి కోవ్ ప్రారంభోపన్యాసం చేశారు. అఖిల భారత కిసాన్ సభ నాయకులు ఎం.వి. కృష్ణారావు, భారత జాతీయ మహిళా సమాఖ్య ఉపాధ్యక్షురాలు రాజకుమారి తమ సందేశాలను అందించారు. ❁

## వినిమయ ధరల సూచిక

(2001)

(బేస్ 1982=100)

| సెంటర్ సిరీస్ | సెప్టెంబరు | అక్టోబరు | ఫ్యాక్టర్ |
|---|---|---|---|
| ఆలిండియా | 465 | 468 | 4.93 |
| హైదరాబాద్ | 443 | 446 | 5.23 |
| గుంటూరు | 451 | 456 | 5.60 |
| గూడూరు | 446 | 446 | 4.33 |
| విశాఖపట్నం | 446 | 454 | 4.64 |
| వరంగల్ | 468 | 479 | 4.48 |
| కొత్తగూడెం | 479 | 491 | - |
| రాష్ట్ర సిరీస్ | | (1960=100) | |
| విజయనగరం | 402 | 403 | - |
| రాజమండ్రి | 443 | 444 | 4.62 |
| విజయవాడ | 428 | 429 | - |
| ఆదోని | 452 | 453 | 4.38 |
| ఎన్ఎస్‌బి కాంప్లెక్స్ | 450 | 450 | 4.76 |
| ఎంజిపి కాంప్లెక్స్ | 428 | 429 | - |
| ఏ.పి | - | - | 4.97 |

సమాచారం వనరు: డైరెక్టరు ఆఫ్ ఎకనమిక్స్ & స్టాటిస్టిక్స్ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము జారీ చేసినది.
ది లేబరు బ్యూరో గవర్నమెంట్ ఆఫ్ ఇండియా.

# సమైక్య వుద్యమాలే శరణ్యం

కార్మికులు, ఉద్యోగుల హక్కులను హరించే పాలకుల విధానాలకు వ్యతిరేక వుద్యమాన్ని ఉధృతం చేయాలని, సమైక్య వుద్యమాలే శరణ్యమని సి.ఐ.టి.యు ప్రధాన కార్యదర్శి డా॥ యమ్.కె. పాంధే ఉద్బోధించారు.

సి.ఐ.టి.యు, హైదరాబాద్ నగరకమిటీ డిసెంబరు 20న సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో ఐక్యతా సదస్సు నిర్వహించింది. సి.ఐ.టి.యు ప్రధాన కార్యదర్శి డా॥యమ్.కె.పాంధే ప్రధాన వక్తగా పాల్గొని ప్రసంగించారు.

1970లో సి.ఐ.టి.యు, ఆవిర్భవించిన తరువాతే దేశవ్యాపిత సమ్మెలు, సార్వత్రిక సమ్మెలు, సమైక్య పోరాటాలు వూపందుకున్నాయని డా॥ పాంధే తెల్పారు. ప్రపంచ బ్యాంకు సంస్కరణలు వేగంగా అమలు జరుగుతున్న ఈ కాలంలో ఏ ఒక్క కార్మికసంఘం ఒంటరిగా ఈ దాడిని ఆపలేదని, సమైక్యంగా వున్న కార్మికవర్గమే ఆ పని చేయగలదని పలువుదాహరణలతో వివరించారు. కేంద్రంలో వాజ్‌పేయి ప్రభుత్వం పూర్తికాలం కొనసాగితే దేశంలో ప్రభుత్వరంగ సంస్థలు పూర్తిగా తుడిచిపెట్టుకు పోతాయని హెచ్చరించారు. కార్మికవర్గం అనుభవం ద్వారా మరింత శక్తివంతం, సమరశీలం కావాలన్నారు. ప్రజామద్దతును కూడ గట్టుకొని పాలకుల విధానాలను వెనక్కి నెట్టగల వుద్యమాలు అవసరమన్నారు.




సదస్సులో ఐ.ఎఫ్.టి.యు. రాష్ట్ర ప్రధాన కార్యదర్శి యస్.వెంకటేశ్వరరావు ప్రసంగిస్తూ సి.ఐ.టి.యు. ఐక్యతా కృషికి అభినందనలు తెల్పారు. ఐక్యపోరాటాల అవసరాన్ని సాధారణ కార్మికులు గమనించ గల్గుతున్నారని చెప్పారు. బి.యం.యస్ వంటి సంస్థలతో కలసి పని చేయరాదన్న తమ వైఖరిని మార్చుకున్నామని ప్రకటించారు.

సి.ఐ.టి.యు రాష్ట్ర అధ్యక్షులు యమ్.ఎ. గఫూర్ ప్రసంగిస్తూ-"మన రాష్ట్రంలో పెద్ద ప్రమాదం ముంచుకొస్తున్నది. రాష్ట్రప్రభుత్వ విధానాలపై చర్చించేందుకు ముఖ్యమంత్రి చంద్రబాబు గారిని అపాయింట్‌మెంటు ఇవ్వవలసిందిగా తమ సంస్థ వ్రాసిన లేఖకు సమాధానం రాకపోవటం శోచనీయం. ఈ పరిస్థితిని సమైక్యంగా ఎదిరించాలని అందుకోసం సి.ఐ.టి.యు శక్తివంచనలేకుండా కృషి చేస్తుందని" తెల్పారు.

సి.ఐ.టి.యు నగర అధ్యక్షులు యస్.నర్సింహరెడ్డి అధ్యక్షత వహించిన ఈ సదస్సులో కేంద్రప్రభుత్వ రంగ సంస్థల సమన్వయ కమిటీ కన్వీనరు యమ్. పూర్ణచంద్రరావు కూడా ప్రసంగించారు. నగరకమిటీ ఉపాధ్యక్షులు సాంబశివరావు వందన సమర్పణ చేశారు. ❁



# నాకు తెలిసిన నండూరి

**ఎం.కె. పాంథే**

**సిఐటియు అఖిల భారత ప్రధానకార్యదర్శి**

**నే**ను 1958లో ఎ.ఐ.టి.యు.సి అఖిల భారత కేంద్ర కార్యాలయానికి మారినప్పుడు మొట్టమొదటిసారిగా కా॥ నండూరి ప్రసాదరావు గారితో పరిచయం అయ్యింది. ఆ కాలంలో ఆయన అఖిల భారత కిసాన్ సభ ప్రధాన కార్యదర్శిగా వున్నారు. రైతు రంగంలో పని చేస్తున్నా, ట్రేడ్ యూనియన్ ఉద్యమం ఎడల ఆయనకున్న శ్రద్ధాశక్తులు నన్నేంతో ఆకర్షించాయి.

ఆయనతో జరిగిన మొదటి చర్చలోనే కార్మిక కర్షక ఐక్యత సమస్య మా మధ్య చర్చకొచ్చింది. మనం " కార్మిక కర్షక ఐక్యత" గురించి మాటవరుసకు అంటాం తప్ప, ఆ చైతన్యం అభివృద్ధి చేయడానికి చేస్తున్నది ఏమిలేదు. కార్మికుల, రైతుల ఉమ్మడి పోరాటాల ద్వారా ఆ ఐక్యత ఏర్పాడక పోతే మన ఉద్యమాన్ని ఎలా బలోపైతం చేసుకుంటాం ? ప్రజల్లో మన పలుకుబడి ఎలా పెంచుకుంటాం? అని గట్టిగా ప్రశ్నించారాయన. నేను సమాధానం చెప్పేలోపే "ఈ ఐక్యతా నిర్మాణం లో కార్మిక వర్గం నాయకత్వ పాత్ర పోషించాలి. కాని దానికా స్పృహ వున్నట్లు లేదు'' అన్నారు. ఆ అభిప్రాయానికి నేను అంగీకారం తెలిపాను. అదొక కాకతాళీయ సమావేశమైనందున ఆ చర్చ అప్పటికి అక్కడితోనే ముగిసి పోయింది.



ఎ.ఐ.టి.యు.సి కేంద్ర కార్యాలయం నుండి పని చేస్తున్న నాకు డాంగే నాయకత్వంలో అమలయ్యే విధానాలు దేశంలో వర్గపోరాట అభివృద్ధికి ఉపయోగపడదని అర్థమైంది. భారత-చైనా యుద్ధ సమయంలో భారత బూర్జువా వర్గ ప్రధాన మద్దతుదారు స్థాయికి డాంగే దిగ జారడంతో ఈ విధానాలు మరింత నగ్నంగా బయటపడ్డాయి. ఆ సమయంలో అనేక సైద్ధాంతిక అంశాలపై అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో వేడిగా చర్చ సాగుతున్నది. భారత కమ్యూనిస్టు ఉద్యమమూ అందుకు మినహాయింపు కాదు. ఆ కాలంలో నేను కా॥ ప్రసాదరావు గారిని చాలా సార్లు కలవటం, అనేక వివాదాస్పద అంశాలపై చర్చించడం జరిగింది. ఆ చర్చ మమ్మల్ని మరింత దగ్గరికి జేర్చింది. భారత కమ్యూనిస్టు ఉద్యమంలో రాజకీయ సైద్ధాంతిక విభేధాలు తీవ్రమై చీలిక అనివార్యమయ్యే దశ వచ్చింది.

అప్పటికే కా॥ ప్రసాదరావు గారు అవిభక్త కమ్యూనిస్టు పార్టీ జాతీయ కౌన్సిల్ సభ్యులు. డాంగే అవలంభించే తప్పుడు విధానాలపై ఆయన తీవ్రంగా పోరాడేవారు. 1964 లో పార్టీ చీలినపుడు నేను భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు) వైపు చేరాను.

నేను ఎ.ఐ.టి.యు.సి కేంద్ర కార్యాలయాన్ని వదిలి మార్క్సిస్టు పార్టీ అఖిల భారత కేంద్రం నుండి పని చేయసాగాను. కా॥ ప్రసాదరావు గారు 4- అశోకరోడ్ లోని పార్టీ కేంద్ర కార్యాలయానికి వచ్చినపుడల్లా నేను వారిని కలిసే వాడిని. తెనాలి సదస్సు సందర్భంగా ఆయన ఢిల్లీ ట్రేడ్ యూనియన్ నాయకుల్లో ఎవరెవరు ఎటున్నారని ఆతురతగా నన్నడిగారు. ప్రధాన నాయకులంతా డాంగేతోనే వున్నారని చెప్పగా చాలా బాధపడ్డారాయన.

కలకత్తాలో 7వ మహాసభ జరిగిన తర్వాత పార్టీ పై తీవ్ర నిర్బంధం ప్రయోగించబడ్డది. అనేక మంది సీనియర్ నాయకులంతా అరెస్టుకాగా కా॥ ఎన్.పి.ఆర్. అజ్ఞావాసంలోకి వెళ్ళిపోయారు. నా మీదా అరెస్టు వారెంటుంది. నేను పట్టుబడలేదు. పార్టీ ఆదేశం మేరకు కలకత్తాలోని రహస్య కేంద్ర కార్యాలయంలో పని చేయటం ప్రారంభించాను. రహస్య జీవితం గడుపుతున్న కేంద్రకమిటీ సభ్యుల సమావేశం హౌరాలో జరిగింది. మరికొందరు నాయకులతో పాటు కా॥ ప్రసాదరావుకు ఒక కబురందించే బాధ్యత నాకప్పగించబడింది. చాలా ప్రయత్నం తర్వాత ఆయన విజయవాడ సమీపంలోనే దాగి వున్నారని తెల్సుకున్నాను. నగర శివారులోని ఒక చిన్న ఇంట్లో వున్న ఆయన్ను కల్సుకున్నాను. అర్ధరాత్రి వరకు జాతీయ పరిస్థితుల గురించి చర్చించాం. మన శక్తులన్నింటిని కూడ దీసుకోవాల్సిన అవసరం గురించి, ధృఢ చిత్తంతో పోరాటం కొనసాగించాల్సిన అవసరం గురించి కా॥ ప్రసాదరావు గారు చెప్పారు. ట్రేడ్ యూనియన్ నాయకులు చాలా మంది రివిజనిజం వైపు కొట్టుకుపోవడం వల్ల తాను టి.యు రంగంలో పని చేయాలనుకుంటున్నానని ఆయన చెప్పారు. నేను హృదయ పూర్వకంగా ఆ ప్రతిపాదనను ఆహ్వానించాను.

1966 నుండి ఎ.ఐ.టి.యు.సి లో అంతరంగిక పోరాటం తీవ్రరూపం దాల్చింది. ఎ.ఐ.టి.యు.సిలో ఐక్యతను కాపాడ్డం కష్ట సాధ్యమవుతున్నది. చిట్టచివరి ప్రయత్నంగా కా॥ సుందరయ్య గారు చంద్ర రాజేశ్వరరావుకు వ్రాసిన లేఖ కూడా నిరుపయోగమైపోయింది ఆ సమయంలో కా॥ ప్రసాదరావుగారు కార్మికోద్యమం యెడల మరింత శ్రద్ధ కనబరిచారు. మా సంబంధాలు ఇంకా పెరిగాయి. ఎ.ఐ.టి.యు.సి నుండి విడగొట్టుకునే దశ వచ్చింది 1970లో కలకత్తాలో జరిగిన కార్మిక సదస్సుకు కా॥ ప్రసాద రావు ప్రతినిధిగా వచ్చారు. కొత్తగా ఏర్పాడ్డ సంస్థ సి.ఐ.టి.యు అఖిల భారత వర్కింగ్ కమిటీకి ఎన్నికయ్యారు. అఖిల భారత కిసాన్ సభ ప్రధాన కార్యదర్శి స్థాయిలో పని చేసి సి.ఐ.టి.యు వర్కింగ్ కమిటీకి ఎన్నికైనందుకు ఆయన్ని కొందరు ప్రశ్నించారు. కేంద్రంలోని మమ్మల్ని కూడ ప్రశ్నించారు. ఆయన నమ్రతే తర్వాత ఆయన్ని సిఐ.టి.యు అగ్రనేతల్లో ఒకరిని చేసింది. మొదటి ఆంధ్రప్రదేశ్ సి.ఐ.టి.యు కమిటీకి ప్రధాన కార్యదర్శిగా ఎన్నికయ్యారు. ఆ రాష్ట్రంలో సి.ఐ.టి.యు నిర్మాణలో కీలక పాత్ర పోషించారు.

ఒక్క ఆంధ్రప్రదేశ్‌కే ఆయన

(మిగతా 19వ పేజీలో)

కామ్రేడ్ నండూరి ప్రసాదరావు గార్కి జోహార్లు .

# ఆంధ్రాబ్యాంక్ ఎంప్లాయీస్ యూనియన్

(BEFI కి అనుబంధం)

**హైదరాబాద్.**




ప్రెసిడెంట్
**పి. వెంకటరామయ్య**

జనరల్ సెక్రటరీ
**బి. అశోక్ కుమార్**

కోశాధికారి
**టి. ముకుందరావు**

---

ఆంధ్ర రాష్ట్ర కమ్యూనిస్టు ఉద్యమం గర్వించదగ్గ ప్రజానాయకులు,
ఆంధ్రప్రదేశ్‌లో సి.ఐ.టి.యు. ఉద్యమ నిర్మాత, సాహితీవేత్త
బహుముఖ మేధావి

## కా॥ నండూరి ప్రసాదరావు గారికి జోహార్లు



## సి.ఐ.టి.యు - నెల్లూరు జిల్లా కమిటి

దామవరపు చెన్నమ్మ స్మారక భవనం, బాలాజీ నగర్, నెల్లూరు-2.

ప్రెసిడెంట్
**ఐ. జనార్ధన రెడ్డి**

జనరల్ సెక్రటరీ
**నారు కృష్ణయ్య**

(17వ పేజీ తరువాయి)

కార్యకలపాలు పరిమితమైనా జాతీయ స్థాయి ఉద్యమ నిర్మాణ ఆవశ్యకత ప్రాధాన్యతను ఆయన ఎప్పుడు మరవలేదు. విప్లవోద్యమ నిర్మాణంలో కార్మిక వర్గం యొక్క నాయకత్వ పాత్ర గురించి ఆయన ఎప్పుడు నొక్కి చెప్తూండే వారు. కార్మికుల్ని రాజకీయంగా చైతన్య వంతం చేసి, మొత్తం పెట్టుబడి దారి వర్గానికే వ్యతిరేకంగా పోరాడే విధంగా మలచకుండా, కేవలం ఆర్థిక పోరాటాలకే పరిమితమయ్యే ట్రేడ్ యూనియన్లను ఆయన అఖిల భారత వర్కింగ్ కమిటీ జనరల్ కౌన్సిల్స్‌లో మాట్లాడేటపుడు తీవ్రంగా విమర్శించే వారు. ఆయన ఉపన్యాసాలు క్లుప్తంగాను, సూటిగాను ఉండేవి. అలంకారప్రాయమైన భాష ఉపయోగించే కంటే విషయాన్ని నిష్కర్షగా చెప్పేవారు. నిర్మాణం యెడల నిర్లిప్తతను ఆయన సహించేవారు కాదు. "ఉద్యమంలో అంతా బాగుందని సెలవిచ్చే వారు ఉద్యమ పురోగమనానికే పెద్ద అడ్డంకిగా మారతారని" ఆయన ఎప్పుడు అనేవారు.

అనేక సందర్భాంలో, ఉపన్యాసం ఇవ్వటం కంటే, తనఅభిప్రాయలకు మరింత బలం చేకూర్చే అంశాల్ని చిన్న చీటిల మీద వ్రాసి నాకందిచే వారు. లోతైన అవగాహనతో ఉండే ఆ అంశాలు ఉద్యమాభివృద్ధికి ఎంతో సహకరించేవి.

అన్ని అంశాలపై తనకు బలమైన అభిప్రాయాలున్నా, మొత్తం ఉద్యమావసరాలను దృష్టిలో పెట్టుకొని ఇతరుల అభిప్రాయాలకూ తగిన విలువనిచ్చేవారు. ఈ సందర్భంగా బి.టి.ఆర్ స్మారక నిధి కొరకు విశాఖపట్నం జనరల్ కౌన్సిల్‌లో కోటాల నిర్ణయం జరిగిన ఘటన గురించి పేర్కొనాలి. కోటాలు నిర్ణయం అయిన సమయంలో ఆయన సమావేశంలో లేరు. ఆంధ్రప్రదేశ్‌కు రూ.15 లక్షల కోటా చాలా ఎక్కువని, దాన్ని పూర్తి చేయలేమని ఆయన నాతో అన్నారు. కాని అఖిల భారత కేంద్రానికున్న ఇబ్బందులు, ముఖ్యంగా నిధుల లేమి వంటివి పరిశీలించిన తర్వాత మొట్టమొదట ఆ కోటా పూర్తి చేసిన రాష్ట్రం ఆంధ్రప్రదేశ్.

సి.ఐ.టి.యు 10వ అఖిల భారత మహాసభలు ఆంధ్రప్రదేశ్‌లో నిర్వహించడానికి ఆయన గణనీయమైన కృషి చేశారు. కొందరు కామ్రేడ్స్ వెనుక ముందు ఆడినా, విస్తృతమైన ప్లానింగ్‌తో వివిధ సబ్‌కమిటీలను పని చేయించడంలో ఆయన ఎంతో శ్రద్ధ చూపారు. అంత వృద్ధాప్యంలోను మహాసభల సమయంలో తన ముందుకొచ్చిన ప్రతి చిన్న పనిని ఒక సాధారణ వలంటీర్‌లాగా ఆయన చేయటం ఆశ్చర్యం కల్గించింది. మొత్తం మహాసభల సమయంలో ఎటువంటి హంగు, ఆర్భాటాలు ప్రదర్శించని కా॥ ప్రసాదరావు గారు యావత్ ప్రతినిధుల మన్ననలు చూరగొన్నారు. మహాసభను పెద్ద ఎత్తున విజయవంతం చేయుటకొరకు నిర్విరామంగా ఆయన చేసిన కృషి వ్యక్తిగతంగా నన్నెంతో ముగ్ధుణ్ణి చేసింది.

మా ఇద్దరి సంబంధాల్లో ఒక ఘటనను ఇక్కడ పేర్కొనాలి. విశాఖ పట్నం ఉక్కు కర్మాగారం మొదటి దశలో సి.ఐ.టి.యు కాంట్రాక్టు కార్మికుల పోరాటాలు అనేకం నిర్వహించింది. సి.ఎమ్.డి. అటు స్థానిక సి.ఐ.టి.యు నాయకులతో గాని, ఇటు రాష్ట్ర ప్రధాన కార్యదర్శి అయిన కా॥ ఎన్.పి.ఆర్‌తో గాని చర్చించడానికే విముఖత వ్యక్తం చేశాడు. నేనొకసారి ఆయనతో ప్రసాదరావుగారి నేపథ్యం- బెనారస్ హిందు విశ్వ విద్యాలయంలో ఆయన చదువు, కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాణంలోను, తెలంగాణ సాయుధ పోరాటంలోను ఆయన పాత్ర వంటి అంశాల్ని తెలయచేస్తే అటువంటి వ్యక్తితో మాట్లాడ నిరాకరించినందుకు సి.ఎమ్.డి బాధపడ్డాడు. మర్నాడు కా॥ ప్రసాదరావు గారు కల్సినపుడు క్షమించమని ఆయన చేతులుపట్టుకున్నాడు. ఆ తర్వాత సి.హెచ్.నర్సింగ రావుతో కూడా చర్చల్లో కూచున్నాడు.

వృద్ధాప్యంతో కా॥ పర్సాగారితో కల్సి హైదరాబాద్ అఖిల భారత మహాసభల్లో ఉపాధ్యక్ష పదవిని స్వచ్ఛందంగా వదులుకొని, కా॥ గఫూర్, వీరయ్య వంటి యువకులకు జాతీయస్థాయి పాత్ర నిర్ధ్యం కల్పించారు. "ఒక పదవికి ఎన్నికైన వారు చచ్చేదాక అదే పదవిని అంటిపెట్టుకుని ఉండే పద్ధతిని మనం వదులు కోవాలని" అనే వారాయన. అఖిల భారత ఆఫీసు బేరర్‌గా లేకున్నా జాతీయ స్థాయి ఉద్యమం యెడల ఎంతో శ్రద్ధ కనబరిచేవారు.

వయసు మీదపడ్తున్నా, రోజువారి కార్యకలాపాల నుండి ఆయన వైదొలగ లేదు. అంత వయసులోను ప్రయణాలు కొనసాగించే వారు. నిరాడంబర జీవితానికి చాలా ప్రాధాన్యత నిచ్చేవారు. నాయకుల, కార్యకర్తల జీవన విధానంలో పెద్ద వ్యత్యాసాలుండటాన్ని ఆయన వ్యతిరేకించేవారు. "మన కార్యకర్తలు ఇబ్బందులు పడ్తూ అనేక త్యాగాలు చేస్తూంటే వారి మనోభావాలను మనం గౌరవంచాలి, మన జీవన విధానం కూడా పొదుపుగా నిరాడంబరంగా ఉండాలనే" వారు. ఒక కర్మయోగిగా కా॥ ప్రసాదరావుగారు మరణించారు. ఆయన నిరాడంబర జీవితం, సమసమాజ స్థాపన కై అంకిత భావంతో చేసిన కృషి నేటి తరం వారికి ఆచరణీయం. మన దేశ అణగారిన ప్రజల కొరకు ఆయన అవిశ్రాంత పోరునలిపారు. ఆప్రజల పై ఆయనకున్న అవ్యాజ ప్రేమానురాగాలు సి.ఐ.టి.యు ప్రతినిధి వర్గంలో విదేశీ ప్రయణాన్ని తృణికరించేలా చేశాయి. తన జీవితాంతం సోషలిజం కొరకు, అణగారిన ప్రజల ప్రయోజనాల పరిరక్షణకు పరితపించిన కా॥ ఎన్.పి.ఆర్‌కు బహుశా చనిపోయే సమయంలో సైతం అవే ఆలోచనలు ముసురుకొనుంటాయి. కామ్రేడ్ నందూరి ప్రసాదరావు గారి ఆశయాన్ని నెరవేర్చడమే ఆయన వారసులంగా మన కర్తవ్యం.

## కామ్రేడ్ నండూరి ప్రసాదరావు గార్కి విప్లవ జోహర్లు



ఉద్దరాజు రామం భవనం
ప్రారంభ సభలో కా॥ నండూరి,
ఎం.ఎచ్. కొరటాల, అల్లూరు

# సి.ఐ.టి.యు. పశ్చిమ గోదావరి జిల్లా కమిటి

కామ్రేడ్ నండూరి ప్రసాదరావు గార్కి విప్లవ జోహర్లు

# సి.ఐ.టి.యు. తణుకు డివిజన్ కమిటి, ప.గో. జిల్లా

| యూనియన్ పేరు | మండలం |
|---|---|
| 1. శ్రీ అక్కమాంబ టెక్స్టైల్స్ కార్మిక సంఘం | తణుకు |
| 2. శ్రీ సత్యనారాయణ స్పిన్నింగ్ మిల్స్ స్టాఫ్ & వర్కర్స్ మజ్దూర్ యూనియన్ | " |
| 3. స్టేట్‌వేర్ హౌసింగ్ కార్పోరేషన్ & ఫర్టిలైజర్స్ ముఠా వర్కర్స్ యూనియన్ | " |
| 4. ఫ్యాక్ట్ హెడ్ లోడింగ్ హామాలీ వర్కర్స్ యూనియన్ | " |
| 5. ఆంధ్రప్రదేశ్ స్టేట్ సీడ్స్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ హామాలీ యూనియన్ | " |
| 6. తణుకు తాలూకా న్యూ బిల్డింగ్ వర్కర్స్ యూనియన్ | " |
| 7. తణుకు తాలాకా రిక్షా వర్కర్స్ యూనియన్ | " |
| 8. తణుకు మున్సిపల్ ఇంజనీరింగు మరియు పారిశుధ్య వర్కర్స్ యూనియన్ | " |
| 9. జట్టు పని కార్మిక సంఘం, బ్రాహ్మణ చెరువు | పెనుమంట్ర |
| 10. తణుకు తాలూకా రైస్‌మిల్లు వర్కర్స్ యూనియన్ | పెనుమంట్ర |
| 11. తణుకు తాలూకా రైస్‌మిల్లు వర్కర్స్ యూనియన్ | పెనుగొండ |
| 12. పెనుగొండ మార్కెట్ యార్డు హామాలీస్ యూనియన్ | " |
| 13 కానూరు బిల్డింగ్ వర్కర్స్ యూనియన్ | పెరవ |
| 14. పెరవలి మండలం ముఠా వర్కర్స్ యూనియన్ | " |
| 15. ఉండ్రాజవరం బిల్డంగ్ వర్కర్స్ యూనియన్ | ఉండ్రాజవరం |
| 16. సాయి మెంటలాంబ కొబ్బరి ఒలుపు వర్కర్స్ యూనియన్ | భగవరం |



కామ్రేడ్ నండూరి ప్రసాదరావు గార్కి
విప్లవ జోహర్లు

# సి.ఐ.టి.యు భీమవరం డివిజన్ కమిటి

మెంటివారితోట, భీమవరం, పశ్చిమ గోదావరి జిల్లా.

1. భీమవరం తాలూకా ఫ్యాక్టరీ (రైస్‌మిల్లు) వర్కర్స్ యూనియన్ (జి-2400)
2. ఎ.పి. రాష్ట్ర పౌర సరఫరా సంస్థ (ఎన్.ఆర్.పి.అగ్రహారం) ఊండి వేర్ హౌసింగ్ గోడౌన్స్ ముఠా వర్కర్స్ యూనియన్(జి-995)
3. డెల్టా పేపర్ మిల్స్ ఎంప్లాయీస్ అండ్ వర్కర్స్ యూనియన్- వేండ్ర (జి-1065)
4. భీమవరం తాలూకా అట్టల ఫ్యాక్టరీ వర్కర్స్ యూనియన్ (జి- 166)
5. భారతీయ విద్యాభవన్ విశ్వవిద్యాలయ నాన్ టీచింగ్ స్టాఫ్ అండ్ వర్కర్స్ యూనియన్ (జి-1210)
6. రైల్వే గూడ్‌షెడ్ ముఠా వర్కర్స్ యూనియన్, ఆకివీడు. (జి-2277)
7. భీమవరం తాలూకా షాపు వర్కర్స్ యూనియన్ (జి-2310)
8. బజారు లాగుడు బండ్ల కార్మిక సంఘం, భీమవరం (జి-2350)
9. పద్మజ ప్యాకింగ్ వర్కర్స్ యూనియన్, భీమవరం (జి-1988)
10. ది భీమవరం అగ్రికల్చర్ మార్కెటింగ్ యార్డ్ హమాలి వర్కర్స్ యూనియన్ (జి-1685)



రాష్ట్ర క్లాసులు సందర్భంగా ప.గోదావరి జిల్లా సిఐటియు ప్రతినిధులతో ఎన్. ప్రసాదరావు గారు



# ఎన్.పి.ఆర్. స్మృతిపథంలో రాష్ట్ర కార్మికోద్యమం

**ఇదికా॥ ప్రసాదరావుగారి ఆఖరి వ్యాసం**

మన రాష్ట్రంలో సిఐటియు ప్రారంభం నుండి దాని ప్రధాన బాధ్యులుగా వున్న నండూరి ప్రసాదరావుగారిని దాని పరిణామ క్రమాన్ని వివరించమని "కార్మికలోకం" అడిగింది. ఈ మధ్య కొద్దిగా మతిమరుపొచ్చింది. అంకెలు, తేదీలేమైనా పొరబాటు చెప్పొచ్చు. మన డాక్యుమెంట్లు చూసి వాటిని పరిచేయండి" అంటూ 30 సం॥ల చరిత్రపుటల్లోకి ఇలా తొంగి చూశారు. కా॥ ప్రసాదరావుగారు ఆయన మాటల్లోనే విందాం!

"మన రాష్ట్రంలో సిఐటియు ఏర్పాడే నాటికి యావద్భారత దేశంలో డాంగే, ఆయన అనుచరుల కబంధ హస్తాల్లో ఎ.ఐ.టి.యు.సి చిక్కుకొని ఉంది. వారు విప్లవ కార్మికోద్యమ విద్రోహానికి పూనుకున్నారు. అనేక రాష్ట్రాల్లో అతివాదులను తరిమివేసి ఎ.ఐ.టి.యు.సి ని యజమానుల, ఇందిరాగాంధీ నాయకత్వం లోని బడా పెట్టుబడిదారుల ప్రభుత్వ బంటుగా మార్చారు. తాము మైనారిటీలో వున్న బెంగాల్, కేరళ వంటి రాష్ట్రాల్లో సైతం డాంగే శిష్యగణం ఇదే విధానాల్ని కొనసాగించింది. ట్రేడ్ యూనియన్‌ను ప్రజాతంత్ర పద్ధతుల్లో నిర్వహించడానికి బదులు తమ జేబు సంస్థలుగా మార్చుకున్నారు. ప్రభుత్వం ఏర్పరిచిన అనేక కమిషన్ లలో సభ్యులుగా వున్న డాంగే, ఇంద్రజిత్ గుప్తా, కళ్యాణసుందరం మొ॥న వారు కార్మికోద్యమానికి హాని కల్గించే పచ్చి కార్మిక వ్యతిరేక షరతులనుఆమోదించారు. ఆఖరుకు సమ్మెల నిషేధానికి కూడా పచ్చ జెండా వూపారు. బి.టి.రణదివె, పి. రామ్మూర్తి మొ॥న వారు ఈ వర్గసంకర విధానాలను అడుగడుగునా ప్రతిఘటించారు. ఈ ప్రతిఘటనోద్యమ సారాంశమే 1970 లో సిఐటియు ఆవిర్భావం".

కా॥ ప్రసాదరావు గారు కనిపోవడానికి సరిగ్గా 9 రోజుల ముందు ఆయనచెప్పిన విషయాలివి. దాదాపు మరణశయ్య నుంచి మాట్లాడిన ఆయన పై పేరా చెప్పంగానే కొద్దిసేపు సేదదీర్చుకోవాల్సి వచ్చింది. మళ్ళీ ఆయనే పిలిచి చెప్తాను రాసుకోండని ఆనాటి జ్ఞాపకాల్లోకి వెళ్ళారు.

"మన రాష్ట్రంలో సి.ఐ.టి.యు ప్రథమంలో సూమారు 30వేల సభ్యత్వంతో ప్రారంభమైంది. ప్రధాన నాయకులంతా ఎ.ఐ.టి.యు.సి లోనే ఉండిపోయారు. పర్సాసత్యనారాయణ, బాలాజీదాసులే మన వైపు కొచ్చిన ముఖ్యనాయకులు. మనం మొదట్నించి కార్మిక వర్గ ఐక్యతకు, ఐక్యపోరాటాలకు అత్యంత ప్రాధాన్యత నిస్తూవచ్చాం. మనం ఎదుర్కోవల్సి వచ్చిన మొదటి పెద్ద సమస్య పారిశ్రామిక సంబంధాల బిల్లు. ఈ బిల్లుకు ఎ.ఐ.టి.యు.సి



కొన్ని సవరణలతో ఆమోదం తెల్పగా మనం పూర్తిగా వ్యతిరేకించాం. చివరకు ఆ బిల్లు మన రాష్ట్ర అసెంబ్లీ ముందుకు రాకుండానే సహజమరణం పొందింది. అప్పట్నించి తాజాగా ముగిసిన ఆర్.టి.సి సమ్మె వరకు ఎ.ఐ.టి.యు.సి, సి.ఐ.టి.యులు భిన్నమైన వైఖరులు తీసుకుంటున్నాయి. పాలక వర్గాల విధానాల యెడల రాజీలేని పోరు సల్పడమే మన ఎత్తుగడల ప్రత్యేకత.

"అఖిల భారత పిలుపుననుసరించి ఆ రోజుల్లోనే డిసెంబర్ చలిని సైతం ధిక్కరించి మన రాష్ట్రం నుండి 3000 మంది ఢిల్లీ ప్రదర్శనలో పాల్గొన్నారు. 1974 వరకు ఢిల్లీలో జరిగిన మూడు మహాప్రదర్శనల్లో మన రాష్ట్రం నుండి స్త్రీ లతో సహా వందలాది మంది పాల్గొన్నారు.

సింగరేణి కాలరీస్‌లోని ఎ.ఐ.టి.యు.సి. అనుబంధ సంఘం అవలంబించే యాజమాన్య లొంగుబాటు విధానాలకు వర్గసంకరమైన, కార్మిక వ్యతిరేక విధానాలపై సాగిన పోరు నుండి సి.ఐ.టి.యు. అనుబంధ యూనియన్ ఏర్పడింది.

ఆర్.టి.సిలోని రెండు ప్రధాన సంఘాలు అవలంబించే వైఖరి వల్ల ఆ సంస్థ కార్మికులు నష్టపోవడాన్ని సి.ఐ.టి.యు తీవ్రంగా పరిగణించింది. ఆ కార్మికుల ఐక్యతా వాంఛకు ప్రతిరూపంగా 1979లో "స్టాఫ్ అండ్ వర్కర్స్ ఫెడరేషన్" ఆవిర్భవించింది. అప్పట్నించి ఐక్యపోరాటాల నినాదంతో సి.ఐ.టి.యు నిర్విరామంగా చేసిన కృషి ఫలించి మొన్నటి అపూర్వ సమ్మె సాకారమైంది".

బహుశా ఈ సమ్మె జరిగిన తీరుపై ఆయన పొందిన సంతృప్తి వల్లనే నేమో నిద్రలోకి జారుకున్నారు. ఈ రోజుకింత కంటే వారిని ఇబ్బంది పెట్టరాదని నిశ్శబ్దంగా "కార్మికలోకం" ప్రతినిధి కూడా నిద్రకు ఉపక్రమించారు. ఆయన వున్న గదిలోనే పడుకుని వున్న ఆ కామ్రేడ్‌ను తెల్లవారి 5గం॥లకే ఎన్.పి.ఆర్ లేపి "రాత్రి నీకు చెప్తూనే నేను నిద్ర పోయాను. లేవగలవా ? పూర్తి చేసేద్దాం!" అనే సరికి హడావుడిగా కాలకృత్యాలు తీర్చుకుని రెండు బ్లాక్ టీలు పెట్టి పెన్ను కాగితం తో అతను సిద్ధమైనాడు.

"విశాఖపట్నంలో షిప్‌యార్డ్ కేంద్రంగా సి.ఐ.టి.యు యాక్టివిటి సాగింది. చాలా కాలం షిప్‌యార్డ్ యూనియన్ మన క్రిందనే ఉంది. మధ్యలో ఒక పర్యాయం నాయకత్వం కోల్పోయాము. ఆకెళ్ళ కృష్ణ మూర్తి క్రిందికి పోయింది. వారు చేసుకున్న 12(3) ఒప్పందాన్ని "3 సున్నాల ఒప్పందం" అని కార్మికులు నిరశించారు. కార్మికుల జీతాల తగ్గింపు, ఇంటి అద్దె పెంపుదల, బస్సు ఛార్జీలు పెంచడం మున్నగు షరతులకు వ్యతిరేకంగా సి.ఐ.టి.యు నాయకత్వాన తిరుగుబాటు జరిగింది. అగ్రిమెంటు చేసుకొచ్చిన నాయకులను కార్మికులు పరాభవించారు. అడ్డు వచ్చిన పోలీసులను తన్ని తుపాకులు లాక్కున్నారు. నాయకులకు బోడిగుండ్లు చేయించి ఊరేగించారు. చివరకు ఆ అగ్రిమెంటు రద్దు చేసి కొత్త ఒప్పందం చేసుకున్నారు. అప్పట్నించి షిప్‌యార్డ్ యూనియన్ సి.ఐ.టి.యు ప్రభావంలోనే ఉంది.

ఇక్కడ మరొక ముఖ్యమైన విషయం చెప్పాలి. షిప్‌యార్డ్‌లోగాని,కొత్తగూడెం బేరియం కెమికల్స్‌లో గాని, చిట్టవలస జ్యూట్‌లో గాని

(కొనసాగింపు 23వ పేజీలో)

*In Memory of Late* **NANDURI PRASADARAO**







కార్మికోద్యమ
పితామహుడు,
అమరజీవి
నండూరికి అరుణాంజలి



కె. ప్రభాకర్ రెడ్డి, అధ్యక్షులు

డి. వెంకటస్వామి, ప్రధానకార్యదర్శి

**సిఐటియు నగర కమిటి,**
**కర్నూలు**

ఉపాధ్యక్షులు
ఇ. పుల్లారెడ్డి
కె. రాజగోపాల్
జి. సుబ్బయ్య
ఎస్.ఎ. సుభాన్
కె. రాజేశ్వరరెడ్డి

కార్యదర్శులు
వి. ర[illegible]కుమార్
పుల్ల[illegible]
ఎస్. హేమాదేవి
గౌస్‌దేశాయ్

కోశాధికారి
యు. గోపాల్

22



(21వ పేజీ తరువాయి)

వివిధ సంఘాలు కార్మికులకు తెలియకుండా చేసుకున్న 12(3) ఒప్పందాలను పెద్ద పోరాటాల ద్వారా రద్దు చేయించుకున్నారు కార్మికులు. 12(3) ఒప్పందమంటే శిలాశాసనమనే భావం తప్పని రుజువయ్యింది. "చిత్తూరు జిల్లాలో ఉద్యమం అభివృద్ధి చెందాలంటే తిరుపతి తిరుమలల్లోని టి.టి.డి కార్మికుల పై కేంద్రీకరించాలనుకున్నాం. మొదటిగా టి.టి.డి ట్రాన్స్‌పోర్టు వర్కర్స్‌ను సంఘటితం చేసి సంఘం స్థాపించాం. చాలా సం॥లు నేను దాని గౌ॥ధ్యక్షుడిగా ఉండేవాణ్ణి. దాన్లో సి.ఐ.టి.యు స్థిరపడ్డది. ఆ తర్వాత కొంత కాలానికి అనకుంటా ఫారెస్టు వర్కర్స్ మన వైపు వచ్చారు. ఆ తర్వాత తిరుమలలోని దాదాపు అన్ని సంఘాలు సి.ఐ.టి.యు క్రిందికి వచ్చాయి. ఇక్కడ'పోటు' కార్మికులు గురించి ప్రత్యేకంగా చెప్పాలి. వీళ్ళంతా స్వచ్ఛమైన బ్రాహ్మలు. జంధ్యాలు, పెద్ద పిలకముడులు, నుదుటన ఊర్ధ్వపుండ్రము (నామాలు) లు ధరించి చేత్తో ఎర్రజెండాలతో తిరుమలలో వారు ప్రదర్శన జరిపారుచూపరులను ఈ వింత దృశ్యం ఎంతో ఆకర్షించింది". ఆయన ఆయాసపడ్తూంటే అక్కడికి ఆపేశాం. ఆ తర్వాత ఆయన పరిస్థితి మరింత గజారటంతో మళ్ళీ ఆస్పత్రిలో చేరారు. 91సం॥ల వయసులో కూడ నిరంతరం పని చేస్తు ఉండే ఆయన మేథ నవంబర్ 29 రాత్రి 8.30గం॥ల ప్రాంతంలో శాశ్వత విశ్రాంతిలోకి జారిపోయింది. ఇంకా ఎన్ని చెప్పాలనుకున్నారో, ఎంత వ్రాయాలనుకున్నారో..... అర్ధాంతరంగా కా॥ నండూరి ప్రసాదరావుగారు మనల్ని వీడి వెళ్ళి పోయారు.

### కా॥ సుశీలాగోపాలన్‌గారికి శ్రద్ధాంజలి



అఖిలభారత సిఐటియు అధ్యక్షులుగా, కేరళ పరిశ్రమల శాఖా మంత్రిగా పనిచేశారు. ఐద్వా వ్యవస్థాపక నాయకురాలైన సుశీలా గోపాలన్‌గారికి సిఐటియు, కార్మికలోకం శ్రద్ధాంజలి అర్పిస్తున్నాయి

# కా॥ నండూరి చూపిన బాటలో పయనిద్దాం

వి. శ్రీహరి

కామ్రేడ్ ప్రసాద రావు గారు ఇక లేరు. ఇది మింగుడు పడని సత్యం. నేను పుట్టక ముందే ఆయన కమ్యూనిస్టు.ఆయన రాష్ట్రంలో ట్రేడ్ యూనియన్ బాధ్యతలు తీసుకున్న నాటి నుండి ఆయనతో అత్యంత సన్నిహితత్వం ఏర్పడింది. నేను సిఐటియు రాష్ట్ర కేంద్రంలో బాధ్యతలు తీసుకున్న నాటి నుండి ఈ సాన్నిహిత్యం ధృడతరమైంది. ఆయన ప్రత్యక్ష్య మార్గ దర్శకత్వంలోనే అనేక కొత్త రంగాలకు సిఐటియు విస్తరించింది.

నేను పార్టీలో కళ్ళు తెరిచే నాటికే ఆయన కేంద్రకమిటీ సభ్యుడు. పార్లమెంటు శాసన మండలులలో సభ్యుడుగా వున్నారు. అలా వున్నా, లేకున్నా ఆయనలో ఎలాంటి మార్పు వుండేది కాదు. అత్యంత సాధారణ జీవితం ఆయనది. అంతేగాదు, తన అవసరాలన్నిటినీ ఆయనే సమకూర్చుకునే అలవాటు. చివర రోజుల్లో తప్ప ఆయన అనారోగ్యంతో మంచంపట్టలేదు. యాక్సిడెంట్లే ఆయన విశ్రాంతి తీసుకున్న సమయంలా కనిపిస్తుంది.

రాజకీయ పరిజ్ఞానంలో, అనుభవంలో ఆయనకు, నాకు హస్తి మశకాంతరం వుండేది. తేడాకనపడేలా ఎప్పుడూ ఆయన ప్రవర్తించేవారు కాదు సరికాదా ఎంత అమాయకమైన ప్రశ్న వేసినా, ఓపిగ్గా సమాధానాలు చెప్పేవారు. అనేక విషయాలలో ఆయనతో బేధించిన సందర్భాలు, వివాదపడిన సమయాలు వున్నాయి. కలిసి పని ఛేయవలసి వచ్చేసరికి, ఇవి ఆయన దృష్టిలోనే వుండేవికాదు. వ్యక్తిగత సంబంధాలలో వాటి ప్రభావం అణుమాత్రం కనిపించేది కాదు. అందువల్లనే ఆయనతో ఏ విషయమైనా నిర్మొహమాటంగా మాట్లాడే స్వేచ్ఛ వుండేది. భిన్నాభిప్రాయాన్ని గౌరవించడం, అవతలి వారి వాదనను వినిపించుకునే సహనం, వాటిలో సరియైనవి వుంటే అంగీకరించడం, అవకతవకలుగా వుంటే లోపాలను ఎత్తిచూపేవారు. భిన్నాభిప్రాయం వ్యక్తం చేసిన కామ్రేడ్‌ది తప్పు అనుకుంటే అందుకు మార్క్సిస్టు సాహిత్యం నుండి, చరిత్ర నుండి కోకొల్లలుగా వుదాహరణలు ఎత్తిచూపి, చదివి వినిపించేవారు.ఎదుటివారి పరిజ్ఞానానికి పదును పెట్టే ప్రయత్నం నిరంతరం సాగించేవారు.

సహనంతో మంచితనంతో జరిగే ఈ కృషి శాశ్వత విలువ తెలియని వారు, ఆయన వుండవలసిన సందర్భాలలో సహితం నిక్కచ్చిగా వుండడనే పొరపాటు అవగాహన కలిగివుండే వారు నాకు తెలుసు. కాని, రాజకీయ విషయాల్లో నిర్మాణ విషయాల్లో అవసరమైన సమయాల్లో తడబాటు లేకుండా అమితకఠినంగా వ్యవహరించిన ఘటనలను కూడా నాకు తెలుసు. తానే ఏరి, తరిఫీదు యిచ్చి తయారు చేసిన వారితోనే విడిపడవలసిన సమయంలోను ఆయన నిబ్బరంగానే నిర్ణయాలు చేసేవారు.

మానవత్వం మూర్తీభవించిన మనిషి ప్రసాదరావు గారు. తనతో కలసి పని చేసే వారికే గాదు తనకు పరిచయం గల వారికైనా సరే తనకుగల విస్తారమైన సంబంధాలను ఉపయోగించి ఆదుకునేవారు.

ప్రసాధరావు గారితో మాట్లాడడం ఒక అనుభవం. ఆయన జీవితం రంగరించిన భిన్న అనుభవాల సమ్మిశ్రితం. ఏ రంగ గురించి మాట్లాడినా సరదాగా కబుర్లు చెప్పినంత సులువుగా గతాన్ని తవ్వి చూపేవారు.

జమిందారీ వ్యవస్థ స్వరూపం వివరిస్తూ జమిందారీ సరిహద్దులలో వుండే గ్రామాల కన్యలపైన జమిందార్లు "మొదటి రాత్రి అనుభావ హక్కు" ఎంత క్రూరంగా, ఎలాంటి దుష్ఫలితాలతో అనుభవించేవారో చెప్పేవారు. అవి వినేవారికి కథలే. కాని ఆలోచించేవాడిలో భూస్వామిక విధానం మీద కసిని, ద్వేషాన్ని నూరి పోసే తల్లి చెప్పే నీతుల్లా ఉపయోగించేవి.

1930లలో కాంగ్రెస్ సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాన్ని విరమించింది. విరమణను కమ్యూనిస్టు పార్టీ "ద్రోహం"గా భావించింది. కాంగ్రెస్ నాయకుల పర్యటనలలో నిరసన ప్రదర్శనలు జరిపేవారు. బాబు రాజేంద్ర ప్రసాద్ విజయవాడ వస్తుంటే తాము పదిమంది యువకులు ఎలా ప్రదర్శన జరిపిందీ వివరంగా కళ్లకు కట్టినట్లు, ఆ ఘటనను ఒక హాస్యాస్పద

(కొనసాగింపు 27వ పేజీలో)

